

రంగురంగుల కాగితాల పీలికలను ఫ్రేమ్‌పైన అంటించి, వెనుక కర్రముక్కల సహాయంతో మిట్టపల్లాలవల్ల సజీవంగా రూపింపచేసే చిత్రాలనిర్మాణం అమెరికాలో ఇప్పుడు వ్యాప్తి చెందుతోంది.

ఇది మిసెస్ బొలాషియో రచించిన చిత్రం "బొమ్మరిల్లు". ఈ దృశ్యానికాధారం ఇబ్సెన్ రచించిన నాటకం.

# *LEAD, KINDLY LIGHT*





దారిచూపు కరుణామయజ్యోతీ !
పరివ్యాప్త మహాధ్వాంతమధ్యంలో
నిలిచినాను , నడిపించుము ననుముందకు .
'ం|దతిమిర భరితమునిశి ;
ుదూరమునా గేహము,
'రిచూపి మునుముందుకు
ిపించుము కరుణామయి !
ుగడుగున తడబడునా
ుగులలో శక్తినించు ;
ుగనులే నా పథమున
'వలికొన చూపు మంచు;
'టే ఒక అడుగైనా
మియించిన చాలునులే . .

—కార్డినల్ న్యూమన్

# జనవరి 30 (1948)

☆

శ్రీ రెంటాల గోపాలకృష్ణ

ఆరోజు భూదేవికన్నీరు కార్చింది!
ప్రియునిబాసిన పగిదివలవల ఏడ్చింది!
ఆక్షణం జగతిలో చీకట్లుకమ్మాయి!
కోట్లకన్నీరు లోక ఏరుగాపారాయి!

ఆవేళ చరిత్రపుటలో "నెత్తురుగుఱుతు"
ఆగంట కంటిలో కలకవేసిన నరసు!
ఆగడియ గుండెలోపడు పిడుగుపాటు!
ఆదినం మానవులపై దొంగపోటు!

నడిచిపోయే మనిషి, పరుగులెత్తేబండి,
పనిచేయు యంత్రాలు, రాజ్యాంగ తంత్రాలు,
త్రుటికాలమాగినవి, గతిచెదిరితూలినవి,
వెనుదిరిగి చూచినవి, ఎలుగెత్తి అరిచినవి!

"మన గాంధి, మన తండ్రి, మనకింక లేడోయి!
మతఘాతమాయన్ను బలితీసుకుందోయి!"
ఏడ్చిఏడ్చిన కంట నీరెండిపోయింది!
గుబులుపుట్టిన గుండెధ్వని ఆగిపోయింది!

నరములో శక్తి చెడి దారమైపోయింది!
ప్రాణాలుజగితరిగి నిస్ప్రాణమైనాయి!
ఆకాశదేవతలు ఆహ్వానమంపారో?
స్వర్గంలో వాకిళ్లు తెరుచుకున్నాయేమొ?

చంద్రలోకందాటి, తారాపథంగడచి,
ధ్రువతారమైనాడు, నవలోకమేగాడు,
మనగాంధి, మనతండ్రి, నిజమైనమానవుడు!
మట్టిగడ్డలనుండి మణుల పుట్టించాడు!
కారుచీకటిలోన కాంతికలిగించాడు!
ధ్రువతారమైనాడు, నవలోకమేగాడు,
మనగాంధి, మనతండ్రి, నిజమైనమానవుడు!

# పెళ్లైన పదేళ్లు

బయట సన్నాయిమీద మంగలి గురువులి నాగస్వరం వినబడుతున్నది మీరాసాయిబు తాషామర్పామీద మంగళ వాయిద్యాలు వాయిస్తున్నాడు పందిట్లో పిల్లలసందడి పెనకపక్కగా ఆడవాళ్ల గాజుల గలగలలు ఇవన్నీ పెళ్లిపీటలమీద కూర్చొన్న పెరవలి యాకోబుకు వినబడక పోలేదు వింటూనే వున్నాడు, వింటూ తన్మయత్వం పొందుతున్నాడు తన్మయత్వం పొందబోయేముందు తలవంచుకొన్న పెళ్ళికూతురు బాలమ్మవంక చూసి, ఒక్క చిరునవ్వునవ్వి మరీ పొందుతున్నాడు. ఎన్ని దీర్ఘసంవత్సరాలో ఓపికతో కన్న స్వప్నాలు, యీనాటికి పెరవలి యాకోబు పాలిట—బాలమ్మ యౌవ్వనంలోనూ, మిత్రులూ, ఎరిగినవాళ్ళూ, బంధువులూ అందర్నీ చూడగలిగాడు. వాళ్ళలో చాలామంది కిల్లీలు నములుతున్నారు. మిగతావాళ్ళలో కొంతమంది పెళ్లికూతురు వంక చూస్తున్నారు. మరికొందరు మీరాసాయిబు గడ్డం తాషాల మోతకు వుయ్యాలలూగటం గమనిస్తున్నారు. వాళ్లందర్నీ చిరునవ్వుతో పలకరించాడు. చంద్రాయి అదే పనిగా, వాడికనురెప్పలు శిలలతో సృష్టింపబడినట్లుగా - బాలమ్మ వంకచూడటం తనకు నచ్చలేదు. కాని అందరితోపాటు చంద్రాయిగూడా పల్లికిలించాడు యాకోబుకు మళ్లీ తన్మయత్వం వచ్చింది ఈమాటు వుత్తరీయం సర్దుకుంటున్నట్టుగా నటించి బాలమ్మను మెల్లిగా గిల్లాడు పెళ్ళికూతురు కాలు అవతలకు డికి అక్కమీద గౌరవం ఎక్కువ అసలు పెళ్లిప్లానంతా మరియమ్మ బుర్రనుంచే పుట్టింది. ఆమె బుర్ర ఆలోచనల అత్తవారిల్లు, ప్లానుపుట్టిల్లు.

సెలవలు గనక పెళ్లి బళ్ళోనే జరుగుతున్నది. ముందు పందిరి చిన్నదీ, అందమైనదీ తోరణాలు, రంగు కాగితాలు, పిల్లలు కట్టిన బుట్టబొమ్మలూ పందిరి స్తంభాలను తప్పితే, కర్పాను కనిపించనీయటం లేదు. మరియమ్మ ఏపనిచేసినా అంత వివరంగా చేస్తుంది. చివరకు స్తంభాలకు అరటి ఆకులతో సహా. మరియమ్మ పందిటినుండి యింట్లోకి, తిరిగి పందిట్లోకి తిరగటం చూస్తే కాళ్లు గాలిన డజను పిలులు జ్ఞాపకం వస్తాయి. వచ్చిన వాళ్లందర్నీ కూర్చొమని చోటు చూపు

**మునిపల్లె రాజు**

ఇంద్రుడి సింహాసనంలాంటి పెళ్లిపీట యోగంలోనూ, భోగం పుల్లాక్షి నృత్యం వంటి మీరాసాయిబు తాషామర్పా "రిదాల్లోనూ" అనుభవంలోకి వచ్చినాయి. తన్మయత్వం పొందడా మరి!

పల్లెటూరి బడిమేష్టరు యాకోబు పందిరి చుట్టూ కలియజూశాడు పెళ్లికొడుకు హోదాతో మెడ తిప్పినప్పుడు డెబ్భై మూళ్ళ తలపాగా బరువు నరాలను 'కలుక్కు' మనిపించింది; కాని తను ఆహ్వానించిన పెద్దలూ, పిన్నలూ, లాక్కోలేదు నోట్లో పమిట చెంగు కుక్కుకొన్నది. కోరిచేసుకొన్న మిఠాయి - బాలమ్మ!

* * *

పెళ్లి అజమాయిషీ అంతా యాకోబు విధవ అప్ప - మరియమ్మ తన భుజస్కంధాలమీద నిర్వహిస్తున్నది మరియమ్మకు నా అన్నవాళ్లు ఎవ్వరూ లేరు తమ్ముడు తప్పిస్తే 'నా' అన్న వాళ్ళే గాదు, 'నా' అన్న ప్రాణంలేని వస్తువుగూడా లేదు మరియమ్మ తెలివిగలది అందువల్ల తమ్ముతుంది అందరికి తాంబూలాలు అందిస్తుంది. మర్యాద చేయబడ్డవాళ్ళే తిరిగి కొన్ని సమయాల్లో పొందుతున్నారు మరియమ్మను తెలిసిన బడిపిల్లలకిదంతా యేదో యింద్రజాలంగా కనిపించవచ్చు. యాకోబును బడిమేష్టరు అంటారే గాని, పిల్లలు భయపడేది చదువురాని మరియమ్మ వాలికను జూసే. బతికివున్న పిల్లవాడెవడూ—మరియమ్మ చూపుమేరలో—గాలిపటాలు ఎగరవేయలేదు గోలీకాయ లాడి పొడుగు సాగని వేళ్లతో యింటికి వెళ్ళలేదు బుగ్గలు నూత్నరక్తంతో ఎర్రబడకుండా పుల్లరేగాయలు తినలేదు ఇవ్వాళ మరియమ్మ అట్లా లేదు పచ్చకోక గట్టింది రాములవారిని నమ్మినబంటు మూతికి చిఱునవ్వే ఆభరణం తగిలించింది అందువల్లనేమో, ఆ రోజున బడిపిల్లలు పాతజ్ఞాపకాలు మరిచిపోయినది!

మనుషుల్లో చెడ్డ చెప్పుకోవటం లోకానికి పరిపాటయిపోయింది తరతరాలనుండీ. ఆర్యులు అనగా—పెద్దమనుషులు (ద్రావిడులు గూడా కలుపుకొని) అయినవారు ముందు మనుషుల మంచిని లోకాభిరామా

యణంగా చెప్పకొని, ఆ తరవాత మిామాంసలకు దిగుతారు ఆర్యులుగాని కాకిమూక-యీ బడిపిల్లలున్నారే, వీళ్ళ బుర్రల్లోకి ఎక్కని సచ్చరిత్ర మరియమ్మ సొమ్ము ఆ చరిత్రనుగురించి మనం కొంచెం ముచ్చటించుకొందాం

* * *

మాజిల్లాకు అమెరికన్ దొరలువచ్చి పొగాకు ఫాక్టరీ కట్టినప్పుడు మతం పుచ్చుకొన్నవాళ్లకే పనులు దొరికినై వేలం వెర్రిగా జనమంతా పొగాకు పండించి, (జొన్నలకూ, రాగులకూ స్వస్తిచెప్పి) వందలు సంపాయించారు. కాని దొరల పుగాకు తాకిడికి, బీడా కి క్కా పాలిట కరువొచ్చింది ధాన్యం ధరలు మేఘాలెత్తున లేచాయి దారుణంగా కరువొచ్చి జనంచస్తుంటే వాళ్లమాట పట్టించుకొన్న ప్రభువు లేకపోయె అప్పుడు దిగారు "మిసినిరీలు" దొరలు అంబలిపోసి 'కిచిడీలు' ఎక్కడబడితే అక్కడే తెరిచారు ఇంకేం, పల్లెల్లో సగంపల్లె మిషనరీల మంత్రం కిందికి వచ్చింది అట్లా మతం బట్టిన పెరవలి యల్లమంద, వురఫ్ దాని యేలు సంతానమే మరియమ్మ, యాకోబూ

1936 లో దొర పొగాకు ఫాక్టరీ కూలినాలిజనం, గ్రేడింగు మేస్త్రీలు, మరలు తిప్పే ఫోర్మెనులూ - యావత్తు జనం సమ్మె చేసింది రకరకాల జెండాలకింద వారం రోజులు ఏకమయ్యారు జెండాలుబట్టిన కుర్రకారు పాటలు పాడతా వూరంతా చుట్టూ పట్టూ తిరిగారు ఏడో రోజున పోలీసులు లారీల్లో దిగారు జెండాలు బట్టిన వాళ్ళని తుపాకులతో కాల్చిపారేశారు ఆదెబ్బలో కొత్తగా మతం పుచ్చుకొన్న యేంకటప్పడూ, అందరికన్నా ముందే పుచ్చుకొన్నదాని యేలు కూగిరి పోయారు అప్పట్లో మరియమ్మ ఫాక్టరీలో గ్రేడింగు ఆడమేస్త్రీ తండ్రి శవంగూడా మరియమ్మకు దక్కలేదు మరియమ్మ ఫాక్టరీ గడప తొక్కటం మానేసింది అంతే, తిరిగి చర్చి మొఖం చూడలేదు ఊళ్ళో అమ్మలక్కలు మరియమ్మ మతం వదిలేసిందని చెప్పకొన్నారు.

యాకోబు మతం మార్చుకోలేదు కడుపు యాత్ర మిషనరీల మీాదుగా పోతున్నది మరియమ్మ మొదట్లో పట్టుబట్టింది కొన్నాళ్లు తమ్ముడితో మాటలు మానేసింది తెలివిగలది గనక మంచీ చెడ్డా, ముందూ వెనకా ఆలోచించి, తమ్ముడి వుద్యోగం కరువుకాలంలో గంజి గనక-తన పట్టు వదలించింది సంవత్సరాలు గడచినై గాని పెళ్ళి విషయం వచ్చేటప్పటికి కష్టం వచ్చింది ఎందువల్ల నంటారా, కాబోయే పెళ్లికూతురు బాలమ్మ మతంలో లేదు !!!

బాలమ్మ తండ్రి మతానికి ఒప్పకోలేదు బాలమ్మగూడా కొద్దిగా చదువుకొన్నది చదువు ఆమాత్రమయినా లేకపోతే లోకలు ఫండు ఆస్పత్రిలో మంత్రసాని పని దొరికేదా? యాకోబు మతం సంగతిని రెండు మూడుసార్లు బాలమ్మ ముందు హెచ్చరించాడు కాని బాలమ్మ జవాబు చెప్పలేదు తలవంచుకొని గబ్బిలాయిలాగా కూర్చొన్నది

వెనకటి మహమ్మదు కొండ తన పాదాల వద్దకు వస్తుందని ఎదురుచూశాట్ట రాలేదు చివరకు మహమ్మదే కొండదగ్గర కెళ్లాట్ట అట్లా అయింది వ్యవహారమంతా పెళ్లి పెద్దల ఆచారం ప్రకారమే జరిగింది— అంటే హిందూపద్ధతన్నమాట మరియమ్మ ప్రతిజ్ఞ చెల్లింది అందువల్ల ఆమె నల్ల వొంటిమీాది పచ్చకోక మెరిసిపోతున్నది ఎట్లా ?!

* * *

మరియమ్మకు—ఆడబిడ్డ బాలమ్మ ఆస్పత్రిలో పనిజేయటం యిష్టంలేదు యాకోబుకు అసలే లేదు అంత పచ్చటి పిల్లకు మంత్రసాని పనితనం పైగా తను వుద్యోగం చేస్తున్నాడు, బాలమ్మకి పెళ్లి అగ్గానికి ముందే అప్పా తమ్ముళ్లు చెవులు కొరుక్కున్నారు అంటే ఏదో గొప్పవిషయం సంభవించిందన్నమాట వచ్చేనెలలో పెళ్ళి అనగా— బాలమ్మ తిరిగి - కంటున్న తల్లుల యాతనలు చూడలేదు - ఆస్పత్రిలో

బాలమ్మ పరాయిపిల్ల కాదు మరియమ్మకూ, యాకోబుకూ మేనత్తకూతురే యాకోబుకు కొంచెం గర్వంవుంది తన వాళ్లలో మొదటిసారిగా "మిటిక్లేషను" పాసయిందీ, వుద్యోగం చేస్తున్నదీ తనే గదా అని తన పాతపద్ధతులన్నీ వదిలేశానుకొనేవాడు తను అందరి మూర్ఖులవంటి వాడు కాదు! యాకోబులో అన్నిటిని మించిన గొప్పవిషయం ఒక్కటున్నది— అది తను గుప్తంగా దాచుకొన్న బాలమ్మ ప్రేమ

ధరలు తగ్గుతవని మూడేళ్లు చూశారు తగ్గలేదు, పరిగదా - యిసికకు దాహం తీరవట్టు వాటి దాహానికి దలివేంద్రాలు చాలటంలేదు అప్పటికి బాలమ్మ పెద్దమనిషై వాలు గేళ్లు దాటింది మరియమ్మకు తోచలేదు

మేనత్త కొండుతులాల బంగారం, ఆరు చీరెలు లేనిదే పెళ్లిమాట తలవద్దని ఖచ్చితంగా చెప్పింది. దీనినిగురించి మనస్పునంతా మథనం చేసుకొంటున్నదో - అదే సంభవించింది. అప్పు !! ఇక తప్పలేదు

మరియమ్మ కుడిచేతి బొటనవ్రేలి ముద్ర కిందా, యాకోబు యింగ్లీషు సంతకంకిందా, మొహతాదు వెంకన్న యిచ్చిన నోటు బాకీ, వడ్డీకింద ముందే తెగ్గోసుకొన్న ఏభయి రూపాయలుపోనూ మూడొందల యాభైతో పెళ్ళిముహూర్తం టంచనగా కుదిరింది

ముహూర్తాలు పెట్టించిందిగాని మరియమ్మ మూగనోము బట్టింది పట్టణా - చిల్లిగవ్వ నిలవలేనివాళ్లకు మూడొందలే? అప్పు - నెలకు నూటికి రూపాయన్నర వడ్డీ చొప్పన మరియమ్మ చదువుకొనని మొద్దుకు అంకెలూ, చక్రవడ్డీలూ తినిపారేయ సాగినై ధక్కాముక్కాలు తిన్న తెలివిగల ఘటంగనక ముహూర్తాలు కుదిరిన మర్నాటినుంచే అప్పుతీర్చి నోటు చింపివేయించుకొనే మార్గాలు ఆలోచించ సాగింది యాకోబు అంతులేని కలల్లో అప్పు అతకలేకపోయింది నోటుమీాది అస్పష్టపు అక్షరాలైనా పూలవంటి బాలమ్మ కళ్లలో అతనికి కనిపించలేదు మరియమ్మ ప్లానులకు, తమ్ముడి అమాయకత్వంలో కొత్త సత్తువ వచ్చింది

విధవ అప్పు అతనికి నచ్చచెప్పించాకా

'ఆమె ఆలోచన యిదీ' అని యాకోబుకు తెలీదు. యాకోబుకు అప్పు నొసటిమీద విశ్వదేవతలు కనిపించారు. ఇక పెళ్లి ప్రయత్నాలు జోరుగా సాగాయి.

మరియమ్మ ఏ వివరానికి ఆ వివరం, చదువుకొన్న గజహంతకుడి హత్యా ప్రయత్నంవలె, మెదడులో బొమ్మ గీచుకొన్నది. పెళ్లికి అందర్నీ పిలవాలి – బడిపిల్లల తలిదండ్రులనుండి దూరపు చుట్టాలదాకా. పెళ్లి ఆ వూళ్ళో యిదివరకు జరగని నవీన మార్గంలో వుండాలి. కరణంగారు గ్రాంఫోను బదులిస్తారు. బడి బెంచీలకు తోడు మొహతాదు గారింట్లో పెద్దబల్ల, పరంధామయ్యగారి పాత కుర్చీలూ తెచ్చి, కిందకూర్చొనే ఎబ్బెట్టు ఎవరికీ లేకుండా చెయ్యాలి పొద్దున్న పెళ్ళి. ఆ తరవాత నాలుగు గొర్రెల్తోవిందు. చదివింపులు సాయంత్రం. సాయంత్రానికి మూడు బిజిలీలైట్లు తెచ్చేందుకు ఏర్పాట్లు. చదివింపులు సాగుతూండగానే పందిట్లో గొళ్ళశివయ్య సారాపీపా బిరడా వూడదీస్తాడు. మరియమ్మ అంచనాలు వేసుకొన్నది.

బడిపిల్లకాయల పెద్దలద్వారా కనీసం రెండొందలయినా చదివింపులు ముట్టాలి. పోగా బంధువులు ఎంత కాదన్నా లేదన్నా యాభైమాట. ఆపైన తమ్ముడు స్వయంగా పిలుచుకొన్న స్నేహితులు. పెళ్లికాగానే ఎవరిదారులు వాళ్లు మాచుకోకుండా మరియమ్మ గొప్ప జాగ్రత్తలే తీసుకొన్నది. నాలుగు గొర్రెల విందును నిష్కారణంగా వదిలిపోయే మూర్ఖులూ, సారా వదిలి గుబులు యిళ్ళకు మళ్ళే చవటలూ తన వూహాలో బొత్తుగా లేరు అందరూ చదివింపులు యింతో అంతో చదివిస్తాంటే వుత్తచేతుల్తోనుంచో గలరా వచ్చిన పెద్దమనుషులు? ఆరోజున అందరూ తనకు పెద్దమనుషులుగాకనబడుతున్నారు. మామూలుగా గాకుండా మనసులో సైతంవాళ్లు పెద్ద మనుషులే అనుకొన్నది (మామూలురోజుల్లో అందరూ తాగుబోతు వెధవలేగా!) . ...మొత్తం బాకీ తీరగా రెండొందలు మిగలాలని అంచనావేసింది మరియమ్మ—పెళ్ళి చదివింపుల్ని గురించి.



* * *

ప్లాను ప్రకారం పెళ్లి సాగిపోతున్నది. మరియమ్మ క్షణం నించున్నచోట నిలబడటం లేదు పందిరీ, యిల్లూ, పెళ్లి తానే అయిపోయింది.

మధ్యాన్నానికి నాలుగు గొర్రెలమాంసం కూరా, మసాల దినుసుల ఘుమఘుమా పల్లె మీద పిల్లగాలై వీచింది. తన దృష్టిలో పెద్ద మనుషులయిన వాళ్ళందరికీ తొలిసారి, మలిసారి బలవంతాలతో కూరలు వడ్డింపించింది– పెళ్లిపెత్తందారు మరియమ్మ అన్ని వందల వేల త్రేణుపుల మధ్య కూర తిరిగిపోతూన్నది, మరియమ్మ 'యిమాజి సేవకా'లో అప్పులబరువు గూడా క్రమంగా దిరగడైపోతున్నది. వేరేవిధంగా తన ఆశ్చర్యాన్ని వెలిబుచ్చలేక యాకోబు మెల్లిగా నవ్వుకొన్నాడు. విందు ముగిసేటప్పటికి పొద్దు తిరిగింది.

* * *

సాయంత్రానికి మళ్లీ పెళ్లిపీటలు సృష్టి అయినాయ్. అతిథులంతా ఎడమవేపు ఆసీనులై వున్నారు. కుడివేపున నూతన దంపతులు. ఆ ప్రక్కనే గోడ కానుకొని మరియమ్మ చదివింపులపళ్లెం కేసి చూస్తున్నది

మొదటి చదివింపు ఆవుల గోపాలానిది గోపాలానికి పదముగ్గురు సంతానం అందులో ఎనిమిదిమంది ఆడపిల్లల్ని బళ్లో వేశాడు. ఇంకా యిద్దరు ఓనమాలు దిద్దేందుకు తయారుగా వున్నారు. మరియమ్మ అనుకొంటున్నది – ఎనిమిదిమంది పిల్లలు – పిల్లదాని కొక్కటి చొప్పునైనా ఎనిమిది రూపాయలు చదివించాలి – అని. గోపాలం కొంచెం తాత్సారం చేశాడు. మరియమ్మ చూపులనుండి తప్పించుకోవాలని శత ప్రయత్నాలు చేశాడు – తోడేలు బారినుండి తప్పజూస్తున్న గొర్రెపిల్లవలె. రెండిసుండి రెండురూపాయల నోటుతీసి పళ్లెంలో వేశాడు. వెంటనే లేచి పందిట్లో బడ్డాడు. మరియమ్మ బుంగమూతి వంకర్లలో చెమటలు పోసినై

ఆ తరవాత వున్నయ్యమామొచ్చాడు. పల్లెలో వున్నయ్యను ఆడంగులందరూ 'మామా' అంటారు. వున్నయ్యను గురించిన కథలు చాలా వున్నై. అతగాడు రొక్కం చదివించలేదు. ఒక నేతపంచెల చాపు తెచ్చాడు. మరియమ్మ పెదిమలు విరిచింది. అద్దకంవేసినా తను కట్టుకొనేందుకుగూడా ఆ వెడల్పు చాలదు.

మొహతాదు వెంకన్న రూపాయి. వెంకన్న నిజంగా మొహతాదుగాడు. అసలు వుద్యోగం వడ్డీ వ్యాపారం అప్పు విషయంలో ఏమీ గండకత్తెర్లు లేకుండా మరియమ్మ వెంకన్ననుగూడా పిలిచింది పెళ్లికి. ఆ తరవాత ఎఱ్ఱయ్యవి మూడు రూపాయలు ఎఱ్ఱయ్యపీడా వదిలినట్లుగా ఒక్క విదిలింపులో సారాపీపాదగ్గరకు వెళ్లాడు. రంగి అర్ధరూపాయి. రంగికి నివేశన స్థలంకోరకు యాకోబు అర్జీ వ్రాసిపెట్టాడు పిచ్చిముండ పిలవకపోయినా వచ్చి తన విధి తను నిర్వర్తించింది మళ్ళీ కొంచెం ఆలస్యం.

మరియమ్మ నాలుగుమూలలా చూసింది అందరికన్నా ముందే వచ్చి పిచ్చిగాడు పీటల కెదురుగా కూర్చొన్నాడు. పిచ్చిగాడు ఏకాయితంపని వొచ్చినా యాకోబు దద్దకు హాజరయ్యేవాడు. మిర్చి వ్యాపారంలో కొద్దిగా జమచేసినట్టుగా కనబడుతుంది ఆ లెక్కలన్నీ యాకోబే రాశాడు. అందువల్ల మరియమ్మ వాడిమీద మంచిగురి పెట్టుకొన్నది. ఎట్లా లేదన్నా పాతిక రూపాయలు అనుకొన్నది. చాలామంది అంతే అనుకొన్నారు.

పిచ్చిగాడు కొంచెం తటపటాయించాడు, మరియమ్మ అట్లాగని అనుకొన్నది. కాని అది వాస్తవమైనట్లు కనిపించలేదు. అమాంతం లేచి పందిట్లోకి దారి తీశాడు. మరియమ్మ కొంచెం దిగ్భ్రమ చెంది, వాడి వెనకాలే పందిట్లోకి తొంగిచూసింది. సారా పీపాను ముట్టజేశాడు. మరియమ్మకు అరికాళ్ళకింద నిప్పులు పోసినంత పనయింది దొంగముండాకొడుక్కి దమ్మిడీ చదివించను చేతగాలేదు. పైగా సారా...! డబ్బివ్వనివాడు ముందు బోకెక్కాడట!!

మరియమ్మ పళ్లెంవంక జూసింది. పదిహేను రూపాయిలైనా లేవు అప్పటికప్పుడే ముప్పాతిక జనం పందిట్లోకి జారిపోయింది మిగిలివున్న వాళ్లు ఆడవాళ్లు. మరిబోయిన మరియమ్మ తమ్ముడివంక జూసింది. తమ్ముడు బాలమ్మతో ఆటలాడుకొంటున్నాడు!

పెళ్లిపెత్తందారు మీద ఆకాశం వద్దట్టయింది. గుళ్లో గంటలాగా గుండె కొట్టుకొన్నది మరియమ్మకు ఏమీ తోచలేదు. తోచక పాడుతున్న గ్రాంఫోను ఆపేసింది. "బస్సు వచ్చిందోయ్"— పాట

(48-వ పేజీ చూడండి)

# నా పెళ్లి

## "రోష్ని — మధుమూర్తి"

'లేవండమ్మా అమ్మాయిగారూ! లేవండి అమ్మగారు కేకలేస్తున్నారు ఈ ఒక్కరోజు కాస్తంత పెందరాళే లేవమని' ఊహు లేపి లేపి విసుగెత్తి ఆఖరున చల్లటి నీళ్ళు చల్లో, పైమీద దుప్పటిలాగో చేస్తేనే కాని మెలుకువరాని నాకు మృదువైన మాటలతో మెలుకువ వస్తుందా సుబ్బి మళ్ళా ఆరంభించింది లేపటం. 'లేవండమ్మా అప్పుడే కాఫీ తయారయింది. చల్లారిపోతోంది కూడా' ఈ మాటలు వినిపిస్తున్నాయి నాకు కాని లేవడానికింకా పూర్తిగా ఇష్టం లేదు. 'ఊరుకెళ్తారంటమ్మా ఇవ్వాళ త్వరగా లేచి తయారవండి' అంది. నాకు ఊరు కెళ్ళటం అంటే మహా సరదా 'ఆ' అంటూ ఎగిరి గంతేసి లేచి కూర్చున్నా 'ఏ వూరే' అని ఆతృతగా అడుగుతే 'ఆ సంగతులన్నీ అమ్మగారు చెప్తారు. త్వరగా లేవండి' అంది.

ఆ రోజు ఇంట్లో చాలా సందడిగా ఉంది. ఆరు గంటలు కాకుండానే అందరూ లేచారు పాలికాపు రాముడు, పనిమనిషి సుబ్బి తొందరగా పనులు చేస్తున్నారు అమ్మ హడావుడిగా నౌకర్లకు, వంటవానికి పనులు చెప్తోంది మా నాన్నగారు పోయినప్పటినుండీ మా అమ్మే యింటి పనులు, పొలం పనులు కూడా చూసుకుంటోంది. 'రాముడూ పొలంలోకి వెళ్ళి ఎడ్లను తీసుకొచ్చి దానా పెట్టి, గూడుబళ్ళు రెండు, గరిసెబళ్ళు రెండు త్వరగా తీసుకొనిరా" పది గంటలకల్లా యిక్కడనుంచి బయలుదేరాలి' 'ఏమండీ సూరమ్మగారూ అమ్మాయి లేచినట్లుంది. కాస్త కాఫీ, టిఫిన్ ఇవ్వండి' 'సుబ్బీ! నువ్వు త్వరగా పరుపుచుట్ట ఎత్తి హోల్డాలులో సర్దు' అని ఒకటి తరువాత ఒకటి పనులు అందరికీ పురమాయిస్తోంది.

ఊరుకెళ్లటం అంటే నాకుండే సరదా ఎవ్వరికీ లేదని చెప్పవచ్చు. త్వరత్వరగా ముఖం కడుక్కుని, కాఫీ, టిఫిన్ తీసుకొని అమ్మ దగ్గరకు పరుగెత్తాను వివరంగా ప్రయాణం సంగతేమిటో కనుక్కుందామని. అమ్మ పెద్దగదిలో ఇనప్పెట్టెలో నుండి వెండిసామానులు తీస్తూంది. 'అమ్మా! అమ్మా! ఏ వూరే ఇవ్వాళ వెళ్తామట చెప్పవూ' 'చెప్తానుండు' అని ఇనప్పెట్టెకు తాళం వేస్తూ అంది. తరువాత "కాంతం ఇవాళ పదిగంటలకల్లా బయలుదేరి బెజవాడ వెళ్తాము. అక్కడికి పోయేప్పటికి సాయంత్రం ఆరుగంటలు కావచ్చు. అక్కడికే అక్కయ్య, బావ, చిట్టితల్లి, చిన్నాన్నగార్లు అందరూ వస్తారు 'ఎందుకమ్మా! ఏమైనా పండుగా' 'ఆ రేపు ఈ పాటికల్లా పెద్ద పండుగ. ఎంత సందడిగా, సరదాగా ఉంటుం దనుకొన్నావ్. నీకు జ్ఞాపకముందా మూడేళ్ళక్రితం అక్కయ్య పెళ్లిలో ఎంత సరదాగా ఉందో అట్లానే ఉంటుంది రేపుకూడా.' 'అయితే నాకూ సరదాయేనే అమ్మా' 'అన్నట్లు మరిచిపోయాను.' అంటూ అమ్మ నగలపెట్టె తలుపు తెరిచి, తన చిన్నప్పటి సరుకులు, కాసులపేరు, దొరుగల్లీ, పాపిడి పింద్రీలు ఒక్కొక్కటి పైనపెట్టి 'కాంతం! స్నానంచేసి వచ్చి క్రొత్త పట్టు పరికిణీ, జాకెట్టు తొడుక్కో. ఇవన్నీ పెట్టుకో' నువ్వు రోజూలా అల్లరి చేస్తే మరి ఊరికి తీసుకెళ్ళను. బుద్ధిగా గదులోనే కూర్చోవాలి నీకేం కావలసినా ఇక్కడే ఉంటుంది. కోటమ్మ వదుసు' అని చెప్పి వెళ్ళింది. ముస్తాబు నిమిషంలో పూర్తి చేసుకొని, అమ్మ ఊరికి తీసుకొని వెళ్ళదేమోనన్న భయంతో గదులోకివచ్చి కూర్చున్నా. సుబ్బి కూతురు పన్నెండేళ్ళది. నాకంటె మూడేళ్ళు పెద్ద నా మీద దానికెంతో ప్రేమ. ఎప్పుడూ నాతోనే తిరుగుతూ, నే చెప్పినట్లూ వింటూ ఉంటుంది నాకు ఉబుసుపోడానికి మంచి మంచి కబుర్లు చెప్తూ వుంటుంది. బటానీ గింజలు నోట్లో వేసుకుంటూ, కూనిరాగంతీస్తూ కూర్చుంది గుమ్మంలో కోటి అమ్మ ఇందాక చెప్పినవన్నీ విన్నప్పటినుంచీ నా కొక చిన్న సందేహం వచ్చింది రేపు పండగ అయితే అక్కయ్య వాళ్ళు ఇక్కడికే వచ్చివుండేవాళ్ళు. మనం బెజవాడ వెళ్ళటం ఎందుకో తెల్సుకోవాలనిపించింది. కోటమ్మను పిలిచి అడిగాను. అది జవాబు చెప్పకపోవడం సరికదా ఒకటే నవ్వు. పది నిమిషాలపాటు ఆగకుండా నవ్వింది నాకెందుకో అర్థం కాలేదు. చివరికి కోపం వచ్చి 'ఏయ్! ఎందుకట్లా నవ్వుతావ్ పిచ్చి ఎత్తినదానికి మల్లే. నేను అడిగిన దానికి సమాధానం చెప్తే చెప్పు. లేకపోతే ఇక్కడినుండి పో అన్నా. అంతటితో ఆగి 'అమ్మో పిచ్చితల్లీ రేపు మీకు పెళ్ళండీ పెళ్ళి,' అంది. 'ఛీ! నువ్వు మరీను. ఇక్కడుండకు పో' అన్నా ఈ మాటు మరింత కోపం-ఒక మూల సిగ్గుతో. కోటి నవ్వుకుంటూ హాల్లోకి పోయింది.

తలుపుగడియ గబుక్కుని వేసి లోపల కూర్చున్నా. అబ్బా పెళ్లట పెళ్లి నాకెందుకో చాలా సిగ్గుగా ఉంది తలుచుకుంటే. కాని ఎంత సరదాగా ఉంటుందో పెళ్లిలో.

నాకు మూడేళ్ళ క్రితం జరిగిన మా అక్కయ్య పెళ్లి బాగా జ్ఞాపకంలేదు కాని, మొన్న మా వీధిలోనే కరణంగారమ్మాయి జానకి పెళ్ళయింది. ఆ ఆడపెళ్లివారికి మేమేదో వరసని చుట్టాలవుతామని, వాళ్లు పిలిస్తే, పెళ్లి అన్నిరోజులూ అక్కడే ఉండి అన్నీ చూచాను. అప్పుడు మా అమ్మ నాకెప్పుడు పెళ్లి చేస్తుందో అనుపించింది. కాని నాకిప్పుడు ఎంతో సిగ్గుగా ఉంది.

పెళ్ళినాడు మా అమ్మ మంచి చీర కడుతుంది. అమ్మనడిగి నగలన్నీ నేనే పెట్టుకుంటాను పండగకి అక్కయ్య వచ్చినప్పుడు తనే పెట్టుకునేది అమ్మ నగలన్నీ. ఇప్పుడు నేను ఒక్కటైనా ఇవ్వను. అన్నీ నాకే పెడ్తుంది అమ్మ. అన్నట్లు జానకి చెల్లెలు సుగుణకూడా వస్తుందిట. నగలన్నీ పెట్టుకొని వెళ్లి తను ఏడ్చేటట్లు చేస్తా. లేకపోతే మొన్న వాళ్ళ నాన్నగారు మద్రాసునుండి తెచ్చిన నెక్లెస్ పెట్టుకొని చూపించటానికే అరిగిపోయింది. గొప్ప మరీను. నా కొరుగల్లీముందర సుగుణ నెక్లెస్ ఏమూల.

పెళ్ళనే కాబోలు. అమ్మ నిన్నటినుండీ సూరమ్మగారే కాకుండా మరిద్దరు వంటవాళ్ళను పెట్టించి లడ్డూలు, మినపసున్ని, జిలేబి చేయిస్తోంది. నాకు జిలేబీ అంటే ఎంత ఇష్టమో అమ్మనడిగి పెద్ద లడ్డూలు ఎంచి నాక్కావలసినన్ని తింటాను. రేపు రాతమ్మోళ్లు ప్రసాద్, క్రిష్ణ, నామాట వింటారు వేరుసెనగకాయలు తెచ్చిపెట్టమంటే నువ్వే తెచ్చుకో అనేవారు. ఇప్పుడు వాళ్ళనే తెచ్చిపెట్టమంటాను నామాట విని చక్కగా తెచ్చిపెడతారు.

బాజా వాళ్లు ఇంకా రాలేదేమో! జానకి పెళ్ళిలో ముందు రోజు కూడా వాయించారు. బేన్డ్ మేళం కన్న సన్నాయి ఎంత బావుంటుందో! మా వూళ్ళో మంగలి చంద్రయ్య ఎంతో బాగా వాయిస్తాడు. ఎప్పుడూ 'కాంతమ్మగారికి పెళ్ళయితే ఊరికే వచ్చి వాయిస్తానమ్మా కడుపునిండా కమ్మని భోజనం పెడితే సాలు,' అంటూవుండేవాడు వాణ్ణి వచ్చి వాయించమని తప్పకుండా చెప్పాలి పల్లకీలోనో, కారులోనో హాయిగా ఊరేగవచ్చు కారే బావుంటుంది కదూ. గాస్ లైట్లు ఎన్నో పెడతారు. నాకు బలే సంతోషం అట్లా ఊరేగటమంటే అన్ని వీధులూ చూడవచ్చు. మావూరు కన్న బెజవాడ ఎంతో పెద్ద ఊరు. అందుకు చాలా సేపు ఊరేగవచ్చు. రాత్రి ఊరేగిస్తారు కాబోలు. నాకు లైటంటే చాలా సరదా అయినా నిద్ర మేల్కొని ఎవరుంటారబ్బా తెల్లవార్లూను. ప్రొద్దున ఊరేగించకూడదూ మరీను. ఏటన్నిటి మాటకేంగాని జానకి పెళ్ళిలో తన ప్రక్కనే కూర్చుని ఉన్నాడేం ఆ అబ్బాయి పెండ్లి కొడుకు. అట్లా ఇక్కడ కూడా ఉంటాడు కాబోలు. అట్లా కూడా కూడా తిరుగుతో ఉంటే సిగ్గుగా ఉండదూ! పైగా నాచీరతో, తనకండువా ముడి వేస్తారుట. అదేమిటి. ఆ అబ్బాయి ఆడపిల్లలాగా కాటుక బొట్టు పెట్టుకుంటాడు. ఇంకా గాజులు కూడా వేసుకోవలసింది. మరేం! ఆ అబ్బాయికి, నాకు ఒక కంచంలో అన్నం పెడితే మాత్రం నేను చచ్చినా తినను. అతని ఎంగిలి నేనెందుకు తింటాను? నాకు వేరే కంచం వెయ్యమంటాను. లేక



పోతే నాకొక్క వలసినన్ని లడ్డూలు తినటానికి వీలుండదు. పోనీలే రేపుఒక్క రోజేగా ఆ అబ్బాయి అట్లా నావెంటే ఉంటేది, నాకి పెళ్ళి కొడుకు కొత్తగా నే వాళ్ళమ్మతో వెళ్ళిపోయాడు ఈ అబ్బాయి కూడా వెళ్ళిపోతాడులే ఎన్నాళ్ళేం మా యింట్లో ఉండటం

'అమ్మాయీ! కాంతం! పావుగంట నుంచీ తలుపు కొడుతూ వుంటే వినుపించదుటే అల్మారాలో వున్న గాజు గ్లాసు కోసం వచ్చి, ఎంత సేపట్నుంచో పిలుస్తున్నా అదేం నిద్దరో. ఇప్పుడు లేచి అప్పుడే పడుకున్నావూ' అని అమ్మ గొంతు వినిపించింది. తలుపు తీయలేను సిగ్గు తియ్యననటానికి అమ్మ కోప్పడుతుందేమోనని భయం మెల్లగా అడుగు లో అడుగు వేసుకుంటో పోయి తలుపు తెరిచాను. తల వంచుకొని వారికి నిలబడిన నన్ను చూచి 'ఏంచేస్తున్నావమ్మ ఇందాకటునుంచి' అంది 'ఏంలేదు ఊరికే పడుకున్నా,' అన్నా ఇక ఏంచెప్పాలో తెలియక నేను ఆలోచిస్తున్న విషయాలన్నీ మా అమ్మ గుర్తించినట్లు, చిన్న నవ్వు నవ్వుకుంటూ 'పడుకుంటే సరేగాని తలుపు మాత్రం గడియవేసుకోబోకు' అంటూ వెళ్లిపోయింది

బళ్లు సిద్ధమయాయి బళ్ళలో సామానంతా పెడుతున్నారు సుబ్బీ! రాముడూ! కోటేను. మేము గూడుబళ్ళలో ఎక్కి కూర్చున్నాం భోజనాలు, పనులూ అన్నీ ముగించుకొని గడియారం టంగున పది కొట్టింది 'జయం. తోలండి' అని అమ్మ అంటూ ఉండగా మా ప్రక్కయింటి రాముం 'అచ్చి' అని తుమ్మాడు. మా అమ్మ అప్రయత్నంగా 'ఆగండి' అంది. కాని రాముం తలిచచ్చి 'భరవాలేదు. మా వాడికి జలుబు చేసింది. కొంచ తుమ్ములు. ఖాతరు చెయ్యనవసరం లేదు' అని సమర్థించింది అయిదు నిమిషాలపాటు ఎందుకైనా మంచిదని బళ్లు ఆపి, కదిపారు.

మాపూరు దాటే వరకూ చూస్తూ కూర్చున్నా బండిలో. మా పాలెం దాటాయి బళ్ళు అడ్డత్రోవని వెళ్తే దగ్గరని అటు పోనిచ్చారు. మా అమ్మ చిన్నతనంలోనో, మాఅమ్మమ్మ చిన్నతనంలోనో ఆ రోడ్డుమీద దొంగలుండేవారని చెప్పుకునేవారట. మా అమ్మ చెప్పింది నాకు అప్పటినుంచీ నాకారోడ్డు చూస్తేనే భయం రోడ్డు దాటే వరకూ కళ్ళు గట్టిగా మూసుకొని అమ్మవళ్ళో తల పెట్టుకొని పడుకున్నా 'కొంచందూరం పోయాక లేపు' అని అమ్మతో చెప్పాను నాకు బాగా నిద్రపట్టింది అమ్మ లేపలేదో నేను లేపినా లేవలేదో బెజవాడలో మేం దిగటానికి ఏర్పాటు చేసిన బంగళా వచ్చిన వరకూ నిద్రపోయాను పెండ్లి చేయటానికని పెద్ద బంగళా తీసుకున్నారు ఇక్కడకు చాలామంది చుట్టాలు వచ్చారు అవతల వీధిలో మరో పెద్ద బంగళా విడిది ఇచ్చారట వియ్యాలవారు పట్నంనుంచి వచ్చారని అమ్మ నా పెళ్ళి అంతా పట్నవాసపు పద్ధతులలో చెయ్యాలనుకుంటోందిట.

ఉదయం తొమ్మిది గంటల పదిహేను నిమిషాలకు పెండ్లి ముహూర్తం అప్పుడే ఆరున్నరయింది నన్ను పెండ్లికూతురిని చేశారు పేరంటాళ్ళంతా కలిసి. 'ముహూర్తం సమీపిస్తోంది త్వరపడండి' అని మా పురోహితుడు కేకలు పెడుతున్నాడు. మంగళస్నానం చేయించటానికని నన్ను తీసుకెళ్ళారు. వారతు లిద్దంగానే పైవాళ్ళంతా వెళ్ళిపోయారు. నేను ఎక్కువ మారాం చేయటం వలన అమ్మకూడా భులుకుపోసి వెళ్ళిపోయింది. కోటినిస్నానం గది బయట నిలబడి ఉండమని చెప్పాను. పావుగంట తరువాత బయటకొచ్చి చూచేటప్పటికి నాకాశ్చర్యం వేసింది మహా సందడిగా ఉన్న ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది ఇంట్లో ఒక్కరూ కనుపించరే అరే! ఏమిటి వీళ్ళంతా ఎక్కడకు పోయారు ముందర వరండాలో మామయ్య, చిన్నాన్న ఉండాలి వీరీ లేరే. అమ్మ వాళ్లు ఏరి! ఏగదులోనూ కనుపించదేమిటి కోటి ఎక్కడకు పోయింది. నన్నొంటిగా ఉంచేసి వీళ్ళంతా ఎక్కడకు పోయినట్టు.

దక్షిణంవైపున్న గదివేపు పరుగెత్తాను. అమ్మ దిగులుగా కూర్చుని ఉంది. చుట్టూ వున్న వాళ్ళంతా ఆమెను ఓదారుస్తున్నారు నాకేం బోధపడలేదు భయమేసి వీధివేపు పరుగెత్తాను. కోటి వీధిలోంచి వస్తూవుండడం చూచాను. అదికూడా విచారంగా ఉన్నట్లుంది. 'కోటీ త్వరగారా ఇటు ఏమిటి ఇదంతా' కోటి నాకు సమీపంగా వచ్చింది 'చెప్పవే అమ్మ ఎందుకు ఏడుస్తోంది ఇల్లంతా ఇట్లా మారిపోయిందేం-ఎవరికైనా జబ్బుగా ఉందని తెలిసిందా' అంటూ ఆతృతగా అడిగాను. కోటి ముఖం చిన్నబుచ్చుకొని, చెప్పలేక చెప్పలేక 'ఎవ్వరికీ జబ్బు కాదమ్మా. పెండ్లికొడుకుగారు పోయారుటమ్మా' అంది. 'ఆ ఎట్లా' అన్నా కళ్ళనండి గిర్రున నీరు తిరిగింది. కోటి సమాధానం చెప్తోంది మెల్లగా నడిచే నా వెనకాలే వేస్తూ. "ప్రొద్దున్నట బాబుగారున్నూ, వాళ్ళ నాన్నగారున్నూ కారుమీద అట్లా రోడ్డుమీదకు వెళ్లారంటమ్మా. ఇంతట్లోకి మిలిటరీ లారీ అంట. జోరుగావచ్చి మన కారుని గుద్దేసిందట." బాబుగారికి చాలా దెబ్బలు తగిలిపోయారుట." నెమ్మదిగా, భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి నాగదిలో ఉన్న కిటికీచువ్వలు పట్టుకొని, అర్థం కాని బెంగతో, జాలిగా ఆకాశంవేపు చూస్తూ నిలబడిపోయాను. ★

# చీరల బేరం

ఆనాడు ప్రభావతిగారింటికి పేరంటానికి వచ్చిన ఆడ వడుచుల దృష్టి ప్రభావతి కట్టుకున్న చీర మీదనే కేంద్రీకరించబడింది. దానికి కారణమా చీర సొగసుదనమే. నూలు పోగులు, సిల్కు పోగులు కలిసి నేయబడిన ఆచీర తళా తళా మెరుస్తూ ప్రభావతికి క్రొత్త అందాన్నిచ్చింది. అక్కడికొచ్చిన వారిలో ఎక్కువ మంది ఆ చీర వేపు ఆశతో చూసేరు అందరి దృష్టులు తన చీరమీదనే ఉండటం చూసిన ప్రభావతికి యింక కాలు భూమి మీద నిలుస్తుందని ఎలా అనుకోడం!

ప్రభావతిని "ఈ చీర ఎక్కడ కొన్నావమ్మా? చాలా బాగుంది" అని పరామర్శ చేసిన వాళ్లలో ఎక్కువ మంది నలభయ్యో పడిలో కూడా పడ్డారు. కాని పాపం వారికింకా చీరల మోజు తీరలేదు కాబోలు! వీళ్లందరికీ సమాధానం ఇవ్వటానికి ప్రభావతి ఏమాత్రం విసుగు చూపించ లేదు

ఓపికగా చీరలమ్మే వాడిని పిలిచిన దగ్గర నుంచీ, బేరం కుదిరే దాకా జరిగిన సంభాషణ 'తు' 'చ' లతో సహా గ్రామఫోను ప్లేటు వినిపించినట్లు వినిపించింది.

ఆమె చెప్పిన సారాంశం.

ఆ చీరలమ్మే వాడి దగ్గర తను పిలిచే టప్పటికి అదొక్కటే చీరుందట. ఇరవై రూపాయలు చెప్పాడుట మొట్ట మొదట. ఆఖరు బేరం పధ్నాలుగు రూపాయలకిచ్చేడుట.

ప్రభావతి యింటికొచ్చిన అమ్మలక్కలందరూ, తమ మనస్సులలో ప్రభావతి కట్టుకొన్న చీరినే తలుచుకొంటూ, ఆ చీర తాము కట్టుకుంటే ఎలా ఉంటుందో మనసులోనే ఊహించుకొంటూ యిళ్లకు చేరేరు.

శారద ఆనాటి రాత్రి తన భర్తతో–

"ఏమండీ, నేనొకటి అడుగుతాను, లేదనకుండా తెచ్చియిస్తారా" అంటూ మునిముని నగవులతో భర్త నడిగింది.

"అదేమిటో చెప్పకుండానే" అన్నాడు భర్త.

"అమాత్రం ఊహించుకో లేరటండీ మరీనూ"

"నేనేం జ్యోతిష్కుణ్ణనుకొన్నావా నీ మనసులో కోర్కెలు తెలుసుకోటానికి?"

"అదిగాదండీ, మీరు నాకు చీరకొని పెట్టి ఎన్నాళ్ళయింది?"

"ఓ! చీరా! సరేలే, దానికేం, భాగ్యం, ఫస్టుతారీకు రాంగానే షాపుకు పోయి మంచి నేతచీరే పట్టుకొస్తాలే"

"అట్లా గాదండీ నేను చెప్పిన చీరే తేవాలి"

"బాగుంది నువ్వు చెప్పిన చీరంటే, బజార్లో దొరకద్దూ?"

"ఎందుకు దొరకదు? కాస్త నాలుగు కొట్లు చూస్తే, దొరుకుతుంది గాని. మీ కోసం ఎదురుగా పెట్టి అమ్ముతారా ఏమండీ?"

## "శ్రీరాగి"

"అబ్బా నాకదంతా ఎందుకుగానీ, ఆ డబ్బు నీచేతికే ఇస్తా, నువ్వే బజారుకెళ్ళి తెచ్చుకొంటావో యింటిదగ్గరే కొనుక్కుంటావో, నీయిష్టం"

* * *

తరువాత పదిరోజులకు–

"చీరలమ్మా, చీరలు, సిల్కు చీరలున్నాయి, నూలుచీర లున్నాయి, మంచి మంచి నేతచీర లున్నాయి, చీరలమ్మా, చీరలు!" అంటూ బజార్లోనుంచి చీరలవాడి కేక శారద చెవిలో దూరింది.

"ఒరేయి బాబూ, ఆ చీరలవాణ్ని కేకెయ్యరా, త్వరగాపోయి" అని తన కొడుకును పురమాయించింది.

చీరలతను, ఒక మోపెడు చీరల మూటతో యింట్లోకి ప్రవేశించాడు

మూటవిప్పి రకరకాల చీరలు చూపించాడు.

"చూడండమ్మా, చూడండి. ఇవి బెనారసు సిల్కుచీరలు, ఇవి నూలుచీరలు. ఇవి నూలు, సిల్కు కలినేతచీరలు. మీ కేరంగులో కావలస్తే ఆరంగులో ఉన్నాయి" మీకు నచ్చినవి తీయండి.

శారద ప్రతిచీర తీసి పరామర్శగా, చీర రంగు, నేత, బోర్డరు రంగు, చూసింది.

"ఏమబ్బీ, ఈ చీరలంత 'నైసు' గా లేవే?"

"ఈ చీరలు ఇంత నైసుగా వుంటే, లేవంటా రేమమ్మా"

"ఏమో? అంతబాగా లేవు"

చీరలు చాలా అందంగా వున్నాయి. చాలా సున్నితంగా కనపడుతున్నాయి. కాని శారద, స్త్రీ సహజ లక్షణమైన, రిమార్కును పాసు చెయ్యకుండా ఉండ లేక పోయింది.

శారద చెల్లెలు నీరజకూడా వుంది.

"ఏమే నీరజా, 'బ్లూ' రంగు చీర బావుందిటే"

"బ్లూ బాగానే వుందిగాని, బోర్డరు రెడ్ కలరు వేశాడు బావుండ్లే."

"ఈ గులాబీరంగు బోర్డరు చూడు ఎంత బావుందో? కాని ఏంలాభం? చీరకు పచ్చరంగు వేశాడు. చీర అందం అంతా దాంతో ధ్వంసం అయింది"

పాపం చాలా చీరలు చూసింది శారద కాని చీరరంగు నచ్చితే బోర్డరు నచ్చేది కాదు. బోర్డరు నచ్చితే, చీర రంగు నచ్చేది కాదు. ఎట్లా దానికీ, దీనికీ, జత కుదరటం?

ఆడవాళ్లకు నచ్చని రంగుల్లో, చీరలు ఎందుకు తయారు చేస్తారో శారదకు ఓ పట్టాన అర్థం కాలే

"సరే గానీ, అసలు చీరలు ఎంత ధరలో వున్నయ్యో, చెప్పవేం?"

"ధర కేంటమ్మా? కానీ తక్కువ తీసుకుంటాం గాని మీ దగ్గర ఎక్కువ తీసు

కొంటామా? మీకు నచ్చిన చీర తియ్యండి"

ఇన్ని మంచి చీరలలో, శారదకు ఒక్క చీర, ఏరటం తలకు మించిన పని అయింది. అదిగాదని ఇది, ఇదిగాదని అది, నాలుగయిదు సార్లు, తన సెలక్షను మార్చింది.

"సరే, దీని ధర ఎంతో చెప్పు"

"బేరం లేకుండా చెప్తానమ్మా."

"నిన్ను బేరం ఎవడు చెప్పమన్నాడు, అసలు రేటు చెప్పు"

"ఆ చీర పద్దెనిమిది రూపాయలు"

"అమ్మో, పద్దెనిమిది రూపాయలే" అంది శారద.

"ఇతను చీరలకు ఉన్న ధర కన్నా, రెట్టింపు చెప్తున్నట్టున్నాడు." అంది నీరజ

"నేనేం ఎక్కువ చెప్పటం లేదమ్మా, ఈ చీరలే నెల క్రితం ముప్ఫయి రూపాయలకు కూడా అమ్మేయి ధరలు తగ్గినయి గనుకే 18 రూపాయిలే చెప్పాను మీ దగ్గర ఎక్కువ తీసుకుంటే మాకు మాత్రం అది ఉండొద్దుటండీ"

"మరీ విచిత్రంగా చెప్తున్నావేమయ్యా? మొన్న నేగదూ, మా ప్రక్కింటావిడ పధ్నాలుగు రూపాయలకు ఇటువంటి చీర కొంది"

"ఆ రకం చీరలు మా దగ్గర లేవండి"

"చీర ఎన్ని గజా లంటావు?"

"ఏడు గజాలుంటుంది కావలసిస్తే, కొలిచి చూసుకోండి."

శారద చీరెను మడత విప్పదీసి కొలిచి చూసింది తన మూరతో. సరిగా ఏడు గజాలుంది.

"సరేగాని ఈ చీర ఎన్నాళ్ళుంటుం దంటావు?"

"అది నేనెలా చెప్పగల నమ్మగారూ? అది మీ వాడకాన్ని బట్టి ఉంటుంది. అర డజను చీరెలతో, ఆ చీరను వాడితే, రెండు సంవత్సరాలు కచ్చితంగా ఉంటుంది. మీకే తెలుస్తుంది, కట్టి చూడండి."

"ఇది రోజూ కట్టుకోడానికి పనికొచ్చేటట్టు లేదే?"

"అదేమమ్మా అలా అంటారు. ఎంత మంది ఈ చీరలు రోజూ ఉతికి కట్టుకోటం లేదూ? ఆ ప్రక్క బజార్లో ఎంత మంది కిచ్చా నీ చీరలు? వాళ్లను కనుక్కోండి"

"సరేలే, వాళ్లింటికి పోయి మే మిప్పు డెక్కడ కనుక్కోం?

"మిమ్మల్ని కనుక్కోమని గాదండీ, మీకు నమ్మకం లేదంటే చెప్తున్నాను."

"సరేలే ప్రొద్దు పోయింది, అవతలవంట గావాలి. తేల్చు, ఎంత కిస్తావో చెప్పు"

"ఇంకా ఏం చెప్పమంటారమ్మ గారూ? అన్నీ తెలిసిన మీరే బేరమడిగితే నేనేం చెప్పను."

"కాదు, కాదు ఇంకో ధర చెప్పు!"

"పోనీ మీరే చెప్పండి, ఇంకో ధర. కష్టమయితే మానుకొంటాను, యిష్టమయితే ఇస్తా నా ధరకి."

"సరే, పన్నెండు రూపాయల కిచ్చెసెయ్."

"ఏమమ్మా, ఆరురూపాయ తగ్గిస్తున్నావే? ఎవ రిస్తారమ్మ యీలాంటి చీర పన్నెండు రూపాయలకు?"

చీరతలనూ బేరం యింకా కుదిరేటట్లు లేదని చీరలన్నీ సర్దుకుంటున్నాడు మూట కట్టుకోటానికి. శారద సెలెక్టుచేసిన చీరకూడా తీసుకొని మూటలో పెట్టబోయినాడు.

"ఆఁ అది తీస్తావేం? బేరం తేల్చు. నువ్వేం అమ్ముకోటానికి రాలే?"

"మాకూ ఏవో రెండు డబ్బులు మిగలాలనేగదా మేము ఈమూట నెత్తిని పెట్టుకొని వీధులెంబడి తిరగటం? మాకు మోసిన కూలిగూడా గిట్టకుండా అడుగుతారేమమ్మా?"

"నీకు గిట్టకేంలే, బాగానే గిట్టుతుంది"

"ఆఖరిబేరం, పదమూడు రూపాయల కిచ్చెయ్యి" అంది శారద చెల్లెలు నీరజ.

"అబ్బో, అయిదు రూపాయలు విరగ్గోశారూ నేనేం తినాలమ్మా?"

"ఇంక బేరంలేదు ఆ ధరకిస్తే యియ్యి లేకపోతే వెళ్లు"

"మీదే బోణీ బేరమమ్మా, పధ్నాలుగు రూపాయలు చేసుకోండి"



"ఇంకో దమ్మిడీ ఎక్కువయితే మా కవసరం లేదు, తీసుకెళ్లు" అని అంది శారద.

చీరల బేరగాడు మూటవిప్పి శారద సెలెక్టు చేసిన చీరతీసి యిచ్చాడు.

"యీ చీరరంగు వెలవదుగదా ?"

"వెలవదు, వెలవదు, నేం చెప్తున్నాగదమ్మా."

"ఏమో ? వెలుస్తుందేమో"

"ఆరునెలలు ఆ చీర కట్టిన తర్వాత వెలిస్తే, నాకు వాపసు యిచ్చెయ్యండి నేను తీసుకుపోతాను"

"నువ్వు మాకు మళ్లీ కనపడక పోయినావా ?"

"రామ, రామ, మా జీవితమంతా చీరల బేరమయితే ఈ ఒక్క నాటితో సరా ?"

ఇన్ని రాద్ధాంత సిద్ధాంతాలయిన మీదట శారద పదమూడు రూపాయలు చీరలబ్బికి యిచ్చి, ఆచీర తీసుకొని పంపించేసింది.

"ఏమండీ, ఈ చీర చూసేరా, ఏం చక్కావుందో ? మీ కెలాగుంది ?" అంది ఆనాటి సాయంకాలం ఆఫీసునుంచి తిరిగి వచ్చిన భర్తతో

"చూడడానికి బాగా నేవుంది. ఎంత పెట్టి కొన్నావే"

"మీరు కనుక్కోండి"

"పదహారు, పదిహేడు రూపాయ లుండొచ్చు"

"మీరయితే, ఆధరకే తెచ్చేవారు లెండి బజారులో"

"అవునులే, మీ ఆడవాళ్లలాగా, మాకు బేరం చెయ్యటం చేతకావద్దూ ?"

"అవునండీ, వాళ్లు చెప్పిన ధరకు తీసుకుంటే మనకు నష్టంగాదుటండీ"

"వాళ్లమీద నువ్వు నమ్మకముంచితే, మనకు అడగకుండానే సరసమైన ధర చెప్తాడు. బేరం చేసేవాళ్ళు అని తెలుసుకుంటే ఓ అయిదు రూపాయలు ముందుగానే పెంచుతాడు ఎందుకయినా మంచిదని. నువ్వు బేరం మొదలు పెడతావు. ఒక్కొక్క రూపాయే అతి కష్టం మీదే తగ్గించుకొంటూ వస్తాడు. మరీ కష్టం మీద రెండు మూడు రూపాయలు తగ్గించి మీకు గాబట్టి ఈ ధర కిస్తున్నాను. అంటాడు. నువ్వు దాంతో పొంగిపోయి, ఆ తగ్గించిన ధరకు తీసుకుంటావు. అది అసలు ధరకు రెండు మూడు రూపాయలు ఎక్కువగానే వుంటుంది. బేరం చేసి కొన్నామనే తృప్తి మీ ఆడవాళ్లకూ ఉంటుంది బేరం చేసినందుకు అధికలాభం వాళ్లకూ ఉంటుంది"

"అయితే మీరనేది వాడు మమ్మల్ని బోల్తా కొట్టాడంటారు"

"ఆఁ అతురాలా బేరం చెయ్యటమనేది మూడు వంతులు నష్టంగానే పరిణమిస్తుంది. అవతల వాళ్లు మన ముఖ కళవళికలనుబట్టే తెలుసుకుంటారు. మనం బేరం చేసేది చెయ్యండీ"

* * *

ఇంకో పొరిగావిడ శారద కొన్న చీరనే, పన్నెండున్నర రూపాయలకే కొనుక్కుంది. బేరంలో ఆమెది మరీ ఘట్టి చేయన్న మాట.

* * *

శారద తమ్ముడు సుబ్బారావు సంక్రాంతి పండుగకు శారదను పుట్టింటికి తీసుకెళ్లాడు. పండుగకి చీర పెట్టారు పుట్టింటివాళ్లు, అది యించుమించు శారద కొనుక్కొన్న చీరలాంటిదే. కనుక్కొన్న మీదట, ఆ చీరను బజారులో తమ్ముడు సుబ్బారావు పది రూపాయలకే తెచ్చాడు అని తేలింది

అంత చౌకగా చీర ఎలా దొరికిందని విస్తుపోయి తమ్ముడితో, "ఏం తమ్ముడూ, పది రూపాయలకే ఎట్లా ఇచ్చాడురా ఆ చీర ?" అని అంది శారద.

"ఎట్లా ఇయ్యడ మేమిటి. దాని ధర అంతే గాబోలు అంతకే ఇచ్చాడు. మన సంగతి నీకు తెలుసుగా, బేరం చెయ్యమని"

"అయితే అట్లాంటి చీరనే నేను పదమూడు రూపాయలకు కొన్నానురా ?"

"ఇంకేం, మూడు రూపాయల టోపీ వేశాడన్న మాట" అన్నాడు తమ్ముడు సుబ్బారావు.

పాపం శారదకి ఆరోజున సరిగా అన్నం సయించక పోవటమేగాక నిద్రగూడా పట్టలేదు ★

# కరోడా

ఒకటవ తారీఖుని యే భగవంతుడు సృష్టించాడోగాని దాని మహాత్మ్యమాత్రం వర్ణనాతీతం సాధారణంగా చాలా మందికి గత ముప్పదిరోజుల ప్రపంచ యాత్రకు ఆరోజు ధ్రువనక్షత్రం. కొంత మంది అదృష్ట ధురీణులకుమాత్రం రాబోయే నెల యాత్రకు అయిలుజెండా అంటే ఆధార స్తంభం ఏవిధంగాచూచినా నెలజీత గాళ్లకీరోజు ఇలవేల్పులాంటిదని చెప్తే అందులో అతిశయోక్తి యేమీలేదు.

పాపం మార్చుకోడానికి ఇబ్బందిపడతాడా బ్రాహ్మడు" అన్నాడు మా హెడ్డు ఆ ప్రక్కనే కూర్చుని లెఖ్ఖలతో కళవళ పడుతూన్నా నేమో నేను అప్రయత్నంగానే 'ఆ ఫరవాలేదులెండి ఇవ్వవలసిన చోట పదికితక్కువ ఎక్కడా లేవులెండి' అనేశాను మా హెడ్డు ఫక్కున నవ్వాడు.

సాధ్యమైనంతవరకు జీతం పుచ్చుకొన్న తారీఖునే ఇవ్వవలసినవాళ్ళకి ఇవ్వదలచినది యావత్తు ఇచ్చి ఇంటికిచేరడం నాకు రివాజు ఈ నెల అందరికీ ఇచ్చేసి తీరా గాను "ఇది 'కరోడా' అండి" అన్నాడు. "కరోడా! కరోడా! అంటే" అన్నాను. "ఇది మారదండి" అన్నాడు.

నాకు నవనాళ్లు క్రుంగిపోయినట్లయ్యాయి మా యింటికి సంత వెళ్ళాలుంది. జేబులో ఆ రూపాయితప్ప మరోటిలేదు. పోనీ ఎలాగో అతడు పరిచయమే గనక మళ్లీసంతకి ఇస్తానంటే ఒప్పుకుంటాడు అనుకొంటే మరి ఈ మారనిరూపాయి—అన్నట్లు 'కరోడా' సంగతి ఏమిటి? మిగతా కూరా నారా మాటేమిటి? ఎలాగో కష్టపడి నాల్గు

## కౌండిన్య

వేలకు వేలు జీతాలవాళ్ళదగ్గరనుంచీ యీ పైమాట శాస్త్రమైనా మరీ నాబోటి తక్కువజీత గాళ్ళ విషయంలోమాత్రం ఇది మున్నాటికీ నిజము నేను చాలవఱకు మొదటిరకంలోవాణ్ణే. ఆనాడు ఒకటవ తారీఖు. నేను జీతం పుచ్చుకొందామని వెళ్లుతున్నానన్నమాటేగాని బుఱ్ఱ అమాంతం కాపరపు లెఖ్ఖలతోటి తిరిగిపోతుంది ఇందులో ఎవరెవరికి ఎంత ఈయడం? ఎవరెవరి మనస్సులు ఎంతటితో తృప్తిపొందుతాయి? ఎంత మిగుల్చుకొంటే వచ్చే ముప్పదిరోజులూ నెట్టుకుపోతాయి? ఎటూ సరిపోని రాబోయే రూపాయలతో వ్యవహారమెల్లాగా? ఇల్లాంటివి నా ఆలోచనలు. ఇల్లా అతలాకుతలం అయిపోతూనే జీతాల బల్లదగ్గరకు చేరాను. నాకు రావలసినది డబ్భైనాలుగు పై చిల్లర. ఏడుపదులు నాలుగురూపాయలు చిల్లర బల్లమీదపెట్టాడా గుమాస్తా. "అన్నీ పదులే ఇచ్చారు వచ్చుమాస్తే నాలుగురూపాయల చిల్లర ఉన్నాయి అంటే ఏడుపదులు ఏ కాపరుగానైతేనేం తిరోహితమయ్యాయన్నమాట! ఈ నాలుగురూపాయలతోటి నెల అంటే ముప్పదిరోజులు గడవాలన్నమాట! చూడండి అవస్థ! డబ్భైరూపాయలు తీర్చామంటే మళ్లీ డబ్భైరూపాయలు వాడుకోవచ్చుగా. ఇక సంతకీ పాలిడికీ ఈ నాలుగూను పరే ఇక యాత్ర ప్రారంభించాను. ఒక రూపాయి జేబులోవేసుకొని సంతకు బయలుదేరాను చింతపండుకొని ఆ రూపాయి వాడికిచ్చాను రూపాయి చేతిలో పడటంతోటే వాడి కళ మారిపోయింది. దానిని తిరగేశాడు బోర్లేశాడు. తరువాత మీటించి మ్రోగించాడు. రాతిమీదవేసి చితకకొట్టేడు. నేను కాతాదారునవటం చేత ఏమీ అనలేక నా మొగంకేసి తెల్లబోతూచూసి పెదిమవిరిచాడు. "ఏమిటోయి మారదా ఏమిటి" అని తాపీగా అడి

రూపాయలతో గడుపుకొందామనుకొంటే అందోకటి కరోడాయే. ఇన్ని ఊహలతో నా తల గిఱ్ఱునతిరిగింది. ఎలాగైనా యీ రూపాయి మారుస్తేగాని నెల గడవదు. కనుక కొంచెం బూకరిద్దామని ఊహ తట్టింది.

"అదేమిటోయి అల్లంటావు! ఈ రూపాయి అంటే ఎక్కడనుంచి వచ్చిందో తెలుసునా? ట్రెజరీలోనుంచి వచ్చినదో బుట్టలో పెట్టబోతావు ట్రెజరీ అంటే

ఏమిటో తెలుసునా? అక్కడికి మళ్లీ తిరుగులేదన్నమాట. నువ్వు మారదంటే చెల్లుతుందా?" అన్నాను. "నన్ను బాధపెట్టకండి బాబూ. పోనీ మీరే మరోచోటమార్చి నా డబ్బులు నాకు పారెయ్యండి బాబు" అన్నాడు.

ఇంక అతనితో రెట్టిస్తే ఆ సంతలోనే మారదని అకూరకొని ఈకూరకొని రూపాయి మార్చబోయాను కాని ప్రతీవాడు మొగమాటంచొప్పన మార్చుకువచ్చి ఇమ్మనేవాడే. నాకు ప్రాణం విసుగురావడమేకాక ఉడుకుమోతుతనంకూడా వచ్చింది. ఆ సంతమట్టుకి అంతా అయినే. ఎలాగో ఇల్లు చేరాను

ఈ కరోడావిషయం నాకు ఒక పెద్ద సమస్య అయిపోయింది. ఎల్లాగ దీనిని మార్చడం. అసలు మార్చడం తప్పాఒప్పా? ఇది మారదని తెలిసివుండి ఒకనిచేతిలో దీనిని ఏమొగంపెట్టుకొని పెట్టను? అల్లా పెట్టడం మోసంలోచేరదా? ఇది ఎంత పాడుపని....

అయితే మరి ఇది నా దగ్గరికి ఎల్లా వచ్చింది? ఎవడో మోసంచేస్తేనే వచ్చింది కదా! మళ్లీ ఇది ఆ మార్గాన్నే పోవాలి గాని మరోఎత్తు ఎల్లాగా? కనుక మోసం చెయ్యడం విషయంలో తప్పు లేదు

అల్లాగనిచెప్పి ఇది తప్పుకాకుండా వుంటుందా? ఎవడికైనా చేతికిచ్చినప్పుడు పట్టుబడితే ఏదో తప్పుచేసినట్టు బాధపడుతున్నామా లేదా? ఒకడు మోసంచేశాడంటే మనముకూడా చేస్తే అది మర్యాద లక్షణమౌతుందా?

ఇల్లా తిరగ బోర్లాపడుతోంది నా మనస్సు ఇల్లా రోజులు గడిచాయి. మొదట కొన్నిరోజులు ఇదింక మార్చకూడదనుకున్నానుగాని అవసరం హెచ్చినకొలది అవకాశాలు దొరకటం మొదలుపెట్టాయి.

మారనివి వస్తే మార్చకుండా ఉంటే మనకు చెల్లదుకనుక ఎల్లాగో అవసరం గడుపుకోవడం విధి కనుక ఇంకా ఇట్లాంటివే వస్తావుంటే భరించుకూర్చుంటే ఇవే ఎక్కువై మంచివిఖర్చై ఇంట్లో మిగిలేవి ఇవే అవుతాయిగనుక వచ్చే తక్కువరాబడిలో ఇల్లాంటి లోపాలుకూడావస్తే మరీ కష్టంకనక దీన్ని మార్చడంతప్పదు. మంచి రూపాయలు తక్షణం మారతాయి. ఇటువంటివి మార్చాలంటే కొంత ప్రయత్నం చెయ్యాలి ఇవి ఆలస్యంగా మారతాయి. అంతే దానికీ దీనికీ తేడా ఇదిమాత్రం నాణెంకాదా? దానికీదీనికీ కొత్తాపాతా కుండే తేడాఅన్నమాట. ఇది సెకండుహేండన్నమాట సెకండుహేండు వస్తువులు కొనడం మానేస్తున్నామా?

ఇలా మళ్లాయి ఊహలు అవసరాన్ని బట్టి అయితే ఇక మార్చేద్దాం ఈ సెలాఖరు రోజులు గడుస్తాయి అన్న నిశ్చయం కలిగింది

సరే ఇక మార్చడానికి ఉపాయమేమిటి? ఆలోచించాను మొదటిది మనకిచ్చినవాడికి మళ్లీ యిచ్చెయ్యడం చాలరోజులు అవడంచేత అది సాధ్యంకాదు. తరువాత మోసం చెయ్యడం మనకి కష్టంకనుక ధారాళంగా ఏ షావుకారిదగ్గరకైనా వెళ్ళి చిల్లరిమారకం ఎక్కువగాఇచ్చి చిల్లరి తీసుకోడం.

నాకీ రెండోసంగతి బాగా నచ్చింది. ఎందుకంటే మోసం అవసరంలేదు మాడండి. నేను వెంటనే ఒక షావుకారుదగ్గరకువెళ్ళి ఆ రూపాయికి చిల్లర ఇమ్మన్నాను "ఇది మారదండి" అన్నాడు. "తెలుసునోయి; ఎంత వటా తీసుకొని చిల్లర ఇస్తావు" అన్నాను "అరణాలు ఇవ్వండి"అన్నాడు. "ఒక అణా ఇస్తా"నన్నాను 'వీలులేద న్నాడు. నాలుగైదు కొట్లు తిరిగానుకాని పావలా తక్కువ అడిగినవాడెవడూ లేడు.

అసలు వృత్తిపన్నుకే బాధపడుతూంటే యీ మారకపు పన్నుకూడా పడితే ఎల్లాగా? అబ్బే ఇక 'కంటకే నైవ కంటకం' అన్నమాటే. ముక్కుకాటుకి చెప్పుదెబ్బ.

రూపాయి పట్టుకొని ఇంటికిపోయాను. న్యాయానికిపోతే సాగ లేదు మోసం చెయ్యాలి. ఎవరిని మోసపుచ్చగలను?

తెలివిగలవాళ్లని మోసపుచ్చలేం. అజ్ఞానులని మోసపుచ్చాలి దాసీది కొలకొసం డానే జీతానికి చంపుతుంది దానికి పారేస్తే సరి. దానికి కొంతగీత తెలియదు. దాని ఏడుపది ఏడుస్తుంది. దాన్ని ఇల్లాగే ఏడిపించాలి.

అదే జీవికగాపెట్టుకొని ఉన్నదాన్ని ఏడిపించడం మరీఘోరం అని జాలేసింది. కాని అవసరం ఉందికాదూ అది సమాధానం చెప్పింది. 'మనకి పరువూ ప్రతిష్ఠాను. మనం మార్చలేం వాళ్లు కాళ్లోకడుపో పట్టుకొని ఎల్లాగైనా మార్చుకొంటారు' అని.

దాసీది అడగనూ అడిగింది, ఇవ్వనూ ఇచ్చాను. కాని అది సాయంత్రం పనికి వచ్చి నేను ఆఫీసునుండి వచ్చేదాకా అక్కడే కూచుంది. ప్రొద్దున్న ఇచ్చానన్నమాటేకాని నాకు సందేహంగానే ఉంది దీన్ని సమ్మంలో చూశేటప్పటికి నా గుండె గుటుక్కుమంది. దానిని తప్పించుకొని ఇంట్లోకి వెళ్ళిపోబోయాను. కాని అది 'బాబుగారు ఇది మారదండి' అంది నేను ఏమీ ఎరగనట్టు ఏది? అన్నాను. 'మీరు ప్రొద్దున్న ఇచ్చిన రూపాయండి' అంది. అది మారకపోవడమేమిటే? మారకపోతే నాదగ్గరకిమాత్రం ఎల్లాగవచ్చింది? పోయి మార్చుకో. ఏ కళ్ళున్నగాడో అంటే సరా? మిమ్మల్ని తిప్పలు పెడదామని అని ఉంటారు. మీరు మాకుమల్లే మార్చగలరా? ఏదో కాళ్లు కడుపులుపట్టుకొని బతిమాలితే వాళ్ళే యిస్తారు. పో' అని కసిరాను అది కిక్కురుమనకుండా పోయింది. నాకు కొంచెం గుండె దిటవు పడింది.

మర్నాడుప్రొద్దున్న భోజనానికి లేవబోతున్నాను ఇంతలో రాక్షసిలా వచ్చింది ఆ దాసీది. "ఎంతమానిసా ఈ రూపాయి మారలేదండి బాబుగారు. మరోటి ఇప్పించండి బాబ్బాబు" అని దేవులాడింది. నాకు జాలేసింది. పోనీ దీనితో పేమిటి అనిపించింది. కాని మరోటి ఇవ్వడానికి రూపాయి ఏది? అల్లాగని చెప్తే నామోషీ!

'పోవే! ఇచ్చింది మంచిదికాదన్నావు. నీకు మళ్లీ జీతాలొచ్చాకే ఇవ్వడం పో'అని కసిరాను. (ఇదొకవిధమైన ఘరానా) అది పోనీయండిబాబు, ఈ రూపాయిమాత్రం వద్దంటూ గొణుక్కుంటూ చక్కాపోయింది.

అదిపోయాక క్రిందపడిన రూపాయిల చేతితో తీసుకోబోతూంటే బస్తా ధాన్యం

ఎక్తేకంటే బరువనిపించిందంటే నమ్మండి. ఎల్లాగరా దీన్ని వదల్చుకోడం.

మళ్ళీ జీతంవచ్చిందికాని ఈ రూపాయి వదలలేదు. ఆ రూపాయిలన్నీ ఖర్చయ్యాయి. ఇది మారలేదు. నాకేమీ పాలుపోలేదు.

ఇలా నేను ఇబ్బందిపడుతూన్న సమయంలో మా సుబ్బారాయుడు తాత వచ్చాడు. మామూలుగా 'ఏమిటోయి విశేషాలు' అన్నాడు. నాకు ఇంతకంటె ముఖ్యవిశేషం మరొకటి ఏమీతోచనేలేదు. 'ఏమిటోనయ్యా! ఇదివరలో ఎరగం. ఏ రూపాయి అయినా ఇట్టే మారేది ఎదటవాడుగూడా అంతగా పరీక్షించేవాడు గాదు. ఇప్పుడు రూపాయికి అరగంట పరీక్ష అయితే నేగాని ఎవడూ పుచ్చుకోటంలేదు. చచ్చిపోతున్నాం అడుగడుక్కీ ఈ రూపాయిలతోటి. నా దగ్గరకి రెండునెలలయి ఒక రూపాయివచ్చింది. ఇప్పటికీ అది నన్ను వదిలిపెట్టనంటోంది. ఈ కనికష్టపుజీతాలలో రూపాయి దండగపడడమంటే కష్టంగా ఉంది.

ఇలా మొదలుపెట్టాను సొంతగోడు. అవసరం; లే అవసరం ఆలోచించకుండా.

అతడు తాపీగా విన్నాడు. "పోనీ కాఫీ హోటల్లో ఆ దోపిడీలో మారుతుందేమో మాడలేకపోయావ్" అన్నాడు నాకిది ఇదివరలో తోచినవిషయమే. కాని అక్కడైనా అభాసయితే అనేకరకాల వాళ్లుంటారు. వారందరిముందర బాగుండదేమో! నగుబాట్లు వస్తాయేమో అని వెళ్ళలేదు" అన్నాను.

"అయితే నువ్వు విప్రయత్నం చేశావు" అన్నాడు. గతం చెప్పాను. అల్లాగా అంటూ మా తాత సర్దుకొని కూర్చున్నాడు.

"అబ్బాయి నువుచేసినపని అంత మంచిది కాదు. మున్నాట అరవైరోజులు నిన్నంటి పెట్టుకు ఉండేవాళ్ళకి నువ్వు టోకరా వేస్తే ఎల్లా చెల్లుతుందనుకున్నావు! నీతో పరిచయంలేక, అదే మొదటిపరిచయమై యుండి, మళ్లా అతనితో అవసరంరాదనే నిశ్చయముంటే అల్లాంటిపని చెయ్యాలి. అదైనా కూలీనాలీ చేసికొనేవాళ్ళని ఏడిపిస్తే ఆ ఉసురు నీకు తగులుతుంది నువ్వు చెప్పినట్లు తెలుసున్నవాళ్ళని టోకరా కొట్టించలేవు. ఇక ఈ మారనిరూపాయి గ్రహించేవాళ్లెవరో తెలుసునా?" అని ఆగిపోయాడు నాకేసిమాస్తో. 'ఎవరు?' అన్నాను. 'సిబోటివాళ్ళే' అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

నేను తెల్లబోయాను ముందు మాట తోచకలేదు. తరువాత సర్దుకొని నసుగుతో 'నాబోటివాళ్ళకేం?' అన్నాను యధార్థం గుండెల్లో గుద్దిపట్లయినప్పటికిని.

'నువ్వు మరోలాగనుకోకోయి నేను నిజం చెబుతున్నాను. వాస్తవానికి నీకు మంచిరూపాయేదో, కరోడా యేదో తెలియదన్నమాట. కనిపెట్టడం నీచేత కాదని నీదగ్గరకువచ్చినరూపాయే సాక్ష్యం. నే చెప్పేదేమిటి?' అన్నాడు.

అతను అల్లా అంటుంటే నే నేమి చెప్పను! విస్తుపోయి అల్లాగే చూస్తూ కూచున్నాను.

'నీదగ్గర రూపాయి యేదీ?' అన్నాడు. అప్పుడది జేబులోనేఉంది తీసి ఇచ్చాను. పుచ్చుకోగానే మోగించాడు. ఒకసారి తోటే 'ఇక నేం' అన్నాడు తిరగామరగా వేశాడు. 'అరిగిపోయింది' అన్నాడు. అరిచేతిలో ఆడించి 'ఆరిబడుగా' అన్నాడు. నాకిందులో ఒకటికూడా తేలలేదు. 'ఏమిటయ్యా అది. అసలువిషయం ఏమిటో వివరంగా చెప్పబాబు బ్రతికిపోతాను. నిజానికి నాకేమీ తెలియదు అని ఒప్పుకొని శిష్యుడిలాగా జిజ్ఞాసతో రూపాయికేసి పరీక్షిస్తో అన్నాను 'చూడు అబ్బాయి ఈ మోత గుల్లమోత, మోగించి చూడు' అంటూ తన దగ్గరున్న మంచిరూపాయితీసి ఇచ్చాడు నేను రెండూ మోగించాను. (నిజానికి నాకు మోగించడం చేతకాదు) నాకు మోత సమంగానేఉంది. 'ఏం మోతకేం రెండూ ఒకలాగేఉన్నాయి' అన్నాను. 'అల్లాగా' అని వెక్కిరింపుగా అని 'ఇల్లాగియ్యి' అని పుచ్చుకొని ఖంగున మోగించాడు. అతని రూపాయి 'ఖంగు' మని మోగుతో గంభీరంగాఉంది నా రూపాయి డబ్బు మోతలా గుల్లగావుంది. అది అనుభవంమీద తెలిసికోవాలిగాని చెప్పడం కష్టం.

'మాశావా లేదా' అన్నాడు 'ఇంకానూ' అంటూ నా రూపాయి బోర్లించాడు. అంచు అరిగిఉంది. రెండు రూపాయలను చేతితో ఎత్తిమాడమన్నాడు. నా రూపాయి తేలికగాఉంది 'మాశావా అవలక్షణాలు' అన్నాడు. నేను ముగ్ధుడినైపోయి పరీక్షిస్తున్నాను.

అతడు సాగించాడు ఇల్లాంటివేలోట్లు. ఇంకొచూడు గీతలు, గంట్లు ఉంటాయి. ఈ మధ్య చేతరూపాయలు వస్తున్నాయి. అవి మంచి రూపాయల్లాగా సాఫీగా ఉండవు అవన్నీ గమనించికాని రూపాయి తీసుకోకూడదు ఏ లోటున్నా మోతలో తేడావస్తుంది మనిషికి నాడిలాగా రూపాయికి మోత నిదానం. తెలిస్తేఫరవాఉండదు. ఇకముందైనా జాగ్రత్తగా చూసుకో. ఇపుడువచ్చే రూపాయిలు మరీ గమ్మత్తు. అర్ధరూపాయికి దానికి ఆట్టే తేడాఉండదు. ఇదిగోచూడు అని పైకితీశాడు. "ఇదొచ్చియేడాదైనా అప్పుడే దీనికి నకళ్లుకూడా వస్తున్నాయి దీనికో నిదానం ఉంది. నూదంటుకొక్కఉన్న చాకుగాని తాళపుచెవి కాని ఉండటంమంచిది. దానికిరూపాయి

(39-వ పేజీ చూడండి)

నాటిక:

# పరిష్కారం

## శ్రీ తోట వెంకటాద్రి

(మొదటి రంగం)

ఒకటోవ్యక్తి: దరకిటతక దరకిటతక దరకిటతకధోం; ధిమిత ధిమిత తకధిమిత ధిమిత తకధోం, తకధోంతక ఝుంతరి...

రెండోవ్యక్తి: సరిమరి మామగారి సనిపారిద గానిగ దారిమారి దాసరి, సస నీ పసారిగరి సప్పద పప్పద దారి నీధసా..

ఒక: చలి చలి చాలిచాలి చలి చాలి చలీ చలి చాలి యీ చలీ చలిచలి...

రెండో: దుంప తెంపేస్తుంది.

ఒక: యెముకలు కొరికేస్తుంది

రెండో: గజగజ లాడించేస్తుంది.

ఒక: పళ్లు కొయ్యబారిపోతుంది. అరేయ్! అన్నిజంతువులూ చలికాలం కొద్దోగొప్పో బొచ్చు పెంచుకుంటున్నయి గాని మానవుడుమాత్రం యేకారణంచేతనో మరి అలా చేయడంలేదు. యిప్పుడుమనకు వంటినిండా దట్టంగా బొచ్చుంటే, యీచలికి తట్టుకునేవాళ్ళం, యేమంటావ్?

రెండో: ఆదిమానవుడికి బొచ్చు ఉండి ఉండవచ్చు. అయితే పరిణామదశలో, తన తెలివితేటలు అభివృద్ధినొందినకొద్దీ, శీతోష్ణాలనుండి శరీరాన్ని రక్షించుకునేందుకు, యితర సాధనాలు కనిపెట్టి, వంటినిండా బొచ్చు పెంచుకోవడం మానుకొని ఉండవచ్చు. యేమంటావ్?

ఒక: ఆఁ తెలివితేటలు! ఈ చలికాలం తన చలినంతా ఒకచోట పోగుచేసుకుని, ఒక్కుమ్మడిగా మన యిద్దరిమీదనే వగబట్టి, వణికిస్తుందా అన్న యీ తరుణంలో, యీ చలినుండి తప్పించుకోడానికి యే సాధనంలేని మనకు,, ఆ తెలివితేటలు ఘోరాపరాధం చేసినయ్యంటావు యేమంటావ్?

రెండో: ఈ రాత్రంతా యిలా వణుక్కుంటూ, నిద్రలేకుండా యెలా వెళ్ళబుచ్చడమా అంటున్నాను. ఒకవైపున కడుపులో యెలుకలు మహాజోరుగా పరుగులు తీస్తున్నై. విశ్వామిత్రుడు శ్రీరామ లక్ష్మణులకు, అవసరం వచ్చినప్పుడు ఉపయోగించుకోమని, ఆకలిదప్పులు లేకుండా ఓ వరం యిచ్చాట్ట యే మహానుభావుడైనా కనికరించి, అలాంటివరం మనక్కూడా ప్రసాదించినట్లయితే యీ సమయంలో బాగా అక్కరకొచ్చేది.

ఒక: యేంజేస్తాం! ఆకలు మేసుకుంటూ, భవిష్యత్తును కప్పుకొని పండుకుందాం

రెండో. ఆకలుమాత్రం యెన్నిరోజులొస్తాయి? అవిగూడా అయిపోయినట్లేనేటితో. చచ్చిపోతున్నాంరా బాబూ!

ఒక. చచ్చిపోతున్నమాట నిజమే, కాని ప్రాణాలుమాత్రం పోకుండా ఉన్నయి; అంతే తేడా. - అదుగో! అటు చూడు! యెవరో మనవైపు వస్తున్నట్టుంది!

రెండో: ఈ రెండువందల నలభైకోట్ల మానవుల్లో, యే ఒక్కడికీ మన జోక్యం పట్టినట్టులే దింతవరకూ అతనెవరో దారినిబొయ్యే మనిషికావచ్చు. మనతో యేం పనుంటుంది మన దగ్గరకు రావడానికి!

ఒక: కాదురా! నూటిగా యిటే వస్తున్నాడు. చూడు సరిగ్గా!

రెండో: అయితే రానీయ్! బీడీముక్క యేమయినా ఉందేమో ఒకటడుక్కొని చెరి రెండుగుక్కలు పీలుద్దాం; కొంచెం గుండెన్నా వెచ్చబడుతుంది

ఒక: బీడీమాట అటుంచి, ముందతను యెవరో, మనదగ్గరి కెందు కొస్తున్నాడో ఆలోచించు కొంచెం!

రెండో. యెవరైతే మన కెందుకు? యెందుకొస్తే మన కెందుకు? మన దగ్గరున్న దుల్లిపోతుందన్న భయమేమీ లేదు. అథవా, యించుమించు యేదన్నా జరిగితే, అతనొక్కడు మన మిద్దరం భయపడబోకు.

ఒక: భయమా? నాకా? భూలోకానికి దిగివచ్చినా భరవాలేదు నువ్వేం దిగులు పడక్కర్లా!

రెండో: నీ సంగతి నాకు బాగా తెలుసులే, కాని దగ్గరకొస్తున్నాడు, సెమ్మది!

(ఒక నిముషంసేపు నిశ్శబ్దం ఆ మనిషి వాళ్ళదగ్గరకొచ్చి, నిలబడి తదేక తీక్షణ దృష్టితో వాళ్లవైపు చూస్తుంటాడు.)

ఒక: నమస్కారమండీనమస్కారం!

రెండో: యెవరు మీరు?

ఒక: మీ రెవరో యెందుకు మాదగ్గరి కొచ్చారో చెప్పేముందు, మీవద్ద ఓ బీడీ అయినా,

రెండో: లేక సిగరెట్టయినా,

ఒక: ఉంటే అగ్గిపెట్టెతోసహా దయ చేసి...

మూడోవ్యక్తి: చుట్టఅక్కర్లేదూ?

రెండో: తుమిం చాలి యింతవరకూ చుట్టఅలవాటు చేసుకోనందుకు, యెంతో చింతిస్తున్నాం.

ఒక: యే సమయం యెటువంటిదో, అది గూడా అలవాటుచేసుకోవాలనే నిర్ణయాని కొస్తున్నాం.

మూడో: యెవరు మీరు?

రెండో. ముందు మీ రెవరో...

మూడో. నా దుస్తులు కన్పడ్డంలా?

ఒక: యీ వేళటికి సరిగ్గా మూడు రోజులనుంచి,

రెండో: తిండీ నీళ్లు లేకుండా,

ఒక: కటికోపవాసాలు చేస్తూ,

రెండో తలదాచుకోడానికి జానెడు చోటు దొరక్క,

ఒక: భగవంతుడు ఆదాంకు విధించిన శిక్షను మేమిద్దరమే అనుభవిస్తూ,

రెండో: గడుపుతున్నందువల్ల, కళ్ళకు మసకలు కమ్మినై యేమో, సరిగ్గా కన్పడ్డంలా.

ఒక: అందువల్ల మీ రెవరో సెలవిచ్చి

రెండ: సందువల్ల వచ్చే నష్టం యేమీ లేదనుకుంటున్నాం.

మూడో: మీ రెవరో అనుమానస్థులుగా కన్పడుతున్నారు. యేవూరు మీది? యెందు కొచ్చారు? యీ అర్ధరాత్రి, ఈ బజార్లో, యీ దుకాణంముందు కూర్చొని యేం చేస్తున్నారు? తాళం బద్దలుకొట్టడానికేనా మీ ప్రయత్నం? ఖబడ్దార్!

ఒక: ఓహో తెలిసింది. మీరు పోలీసు యినస్పెక్టరో లేక, కానిస్టేబులో అయి ఉంటారు.

మూడో: అవును నేను డ్యూటీకానిస్టేబుల్ని.

రెండ: అయితే యీ వేళ, యిప్పుడు మా దగ్గరికి మీరు ఆప్తబాంధవు డిలా,

ఒక: దీనరక్షకు డిలా,

రెండ: భక్తవత్సలుడిలా వచ్చారు. యిహ వెనకాముందు చూడకండి!

ఒక: ఒక్క దెబ్బతో కాల్చెయండి! మేం రెడీ!

రెండ: మీ రిప్పుడు మా యిద్దరిని కాల్చి చంపినా, అదేం అంటూ మిమ్మల్ని అడిగే వాళ్లు యెవ్వరూ ఉండరు మా శనిగాడు గూడా, యీ క్షణంతో మమ్మల్ని వదిలి పోతాడు.

ఒక: అంతే! యెందు కాలస్యం? కానియ్యండి ఊఁ!



కానిస్టేబులు: మీ రేదో మాటలుజెప్పి నాకు టొకరి వేద్దామనుకున్నారేమో! జాగ్రత! యీ పప్పులు మనదగ్గర ఉడకవ్! మీ యిద్దరినీ అనుమానంమీద అరెస్టు చేస్తున్నా. లేవండి!

రెండో. యింకేం! అరెస్టు చేసి అందులో పెట్టినా యీ రాత్రికి వెచ్చగా పడుకోవచ్చు.

ఒక. అప్రోయ్! చావుమాట రేపొద్దున తాపీగా ఆలోచించుకోవచ్చు. యీ చలిలో, యీ మంచులో కూర్చుని ఇక్కడ గజగజలాడేకన్నా, లాకప్పులో ఉంటేనే బాగుంటుంది పద!

రెండో. అందుకనే జవానుగారూ! జేబులోనుంచి సంకెళ్లు తియ్యండి. అంతలో మేం లేచి నిలబడతాం. పడితే బంగారు కడియాలు లేకపోతే యినుప కడియాలు, అని మా జాతకంలో గూడా ఉంది.

కాని: మీ పేర్లేంటి?

ఒక: నా పేరు, సన్యాసి.

రెండో: నా పేరు బైరాగి.

కాని: ఆఁ యేంటీ!!

సన్యాసి: అవు నంటేనండీ!

కాని. మీరేదో కపట నాటకం ఆడుతున్నారు మీ పేర్లు అవి గావు.

బైరాగి: మీ రేం ఆశ్చర్యపడక్కర్లా జవాన్‌గారూ! మేం బుట్టినప్పుడు మా తల్లిదండ్రులు యెంతో ముద్దుగా,

సన్యా: యెంతో ప్రేమగా, పుత్ర వాత్సల్యంతో పెట్టుకొన్న పేర్లవి. మీరు పేర్లు చెప్పి మిమ్మల్ని మోసం చేయటంలా. రాసుకోండి జల్దీ!

కాని: నాకేం నమ్మకం గల్గటంలా. యిదేదో మంచితంతుగా ఉంది.

బై: అని మీ రనుమానిస్తున్నారు గనక, తీసుకెళ్లి త్వరగా అందులో పడెయ్యండి. యీ చలి భరించలేకుండా ఉన్నాం.

సన్యా: లేకపోతే కాల్చెయండి.

బైరా: అది మొదట్లోనే విన్నవించుకున్నాంగా.

సన్యా: ఆలస్యా దమృతం విషం. యేదో ఒకటి వెంటనే చేసి పుణ్యం గట్టుకోండి జవానుగారూ! అబ్బ!

కాని: (మెత్తబడి) అబ్బాయిలూ!

స, బై: యేమంటున్నారు?

కాని: యేమీ లేదు, యివిగో సిగరెట్లు, అగ్గిపెట్టె. కాల్చండి. (అని రెండు సిగరెట్లు, అగ్గిపెట్టె యిచ్చి వాళ్ల పక్కనే కూర్చుంటాడు. సన్యాసీ, బైరాగి సిగరెట్లు కాలుస్తారు).

సన్యా: ధన్యులం జవాన్‌గారూ!

బైరా: కృతజ్ఞులం. రక్షించారు మమ్మల్ని శేశ.

సన్యా: సరే! యెందు కొచ్చారు వున్నారలా? లేండి పోదాం స్టేషనుకు

కాని మిమ్మల్ని నేను, అరెస్టు చేయడం లేదు. కాల్చి చంపడం లేదు

బైరా: మాకు మహోపకారం చేస్తున్నారు జవాన్ గారూ!

కాని: ఫరవాలేదు. అబ్బాయిలూ! మీ తీరూ, మీ మాటలు చూస్తుంటే నాకు బహు చిత్రంగా ఉంది.

సన్యా. మా జీవితాలే చిత్రవిచిత్రంగా ఉన్నయ్యండీ!

కాని: మీకొచ్చిన భయంలేదు. నిజం చెప్పండి మీ రెవరో!

బైరా: మీరు ప్రథమంలో అనుకున్న వాళ్లం మాత్రం గాదని త్రికరణశుద్ధిగా చెబుతున్నాం. తరువాత మీ యిష్టం.

కాని: నేను పొరపాటుపడి ఉండవచ్చు. మా ఉద్యోగస్వభావమే అటువంటిది మీ మాటలువింటే, మీరేదో ఆపదలో ఉన్నట్టు తెలుస్తూంది. మీ నిజ పరిస్థితి చెప్పండి. నా చేతనయితే కొంత సహాయమన్నా చేస్తా.

సన్యా: యీ నిర్భాగ్యజీవులకు మీరు చేసే సహాయం యేముందండీ! మమ్మల్ని కాల్చి చంపినా మా కష్టాలు యీడేరవి. తీసుకెళ్ళి పదిరోజులపాటు జైల్లోవేసినా, యింత తిండీ, పడుకోడానికి యింతస్థలం దొరికేవి. యెందుకు మీకీ లేనిపోని శ్రమ?

కాని: అలా అనబోకు నాయనా! మనిషికి నిర్లక్ష్యం, నిరాశ యెంతమాత్రం పనికిరావు. ముందు స్టేషనుకు పోదాం పదండి! చలి మహాతీవ్రంగా ఉంది అక్కడ వివరంగా మాట్లాడుకోవచ్చు

స: బై: మీయిష్టం, పోదాం పదండి!

కాని: రాండి! దీనివల్ల నాపనిగూడా ఒకటి పూర్తవుతుంది యేంటంటే; "రాత్రి యిద్దరు మనుష్యుల్ని, అనుమానంమీద అరెస్టుచేసి, తగినసాక్ష్యం దొరికినందున, వారిని నిరపరాధులని, ఉదయమే విడుదల చేశా"నని నా డైరీలో రాసుకుంటా. సరే లేవండిహ పోదాం. (అందరూ లేస్తారు)

(రెండవ రంగం)

సన్యాసి శనివారందాటి ఆదివారంలో పడ్డాం.

బైరాగి మన శూన్యాకాశంలో నవ్యకాంతుల్తో ఆశాసూర్యుడు ఉదయించాడు.

సన్యా. యేమో! కానిస్టేబులు చెప్పిన ప్రకారంగా, మనపని కాకపోతే, యేం చేయాలా అని యిప్పటే ఓకుదుగా ఉంది నాకు ఆయన చాలా ఉత్తముడనే అతను చెప్పడం మరి

బైరా: చేసేదేముంది? రెండు పాత బొచ్చెలు లంకించుకుందాం. దొరికిననాడు పండగ, లేనినాడు యెండగ.

సన్యా: ఆత్మ గౌరవాన్ని చంపుకుని అడుక్కు తినడం యెలాగు బైరాగీ?

బైరా: మన కసలు గౌరవం అనేది ఉంటేగదూ, ఆత్మగౌరవం ఉండడానికి! అన్ని పనులకూ సిద్ధంగా ఉండాలిరా! నీ దగ్గర పెటీ బూర్జువా కళలు యింకా ఉన్నయి మొత్తానికి.

సన్యా: యేమో! పోలీసు కానిస్టేబులు పుణ్యమా అంటూ...

బైరా: పొద్దున్నే రండిడ్లీ, కాఫీ కడుపులో పడ్డాయి. లేకపోతే యీ వేళగూడా మొహం కడుక్కునేవాళ్ళంగాం.

సన్యా: సరే! యిల్లు యిదేనేమో మాండు.

బైరా: ఆఁ యిదే! బోర్డుగూడా ఇదే! భేష్! లోపలికి పోదాంపద!

(యిద్దరూ గేటుదాటి లోపలికి పోతారు. వరండాలో ఒక వ్యక్తి వారికి కనబడతాడు)

సన్యా: ఆయనే కావచ్చు డైరెక్టరు గారు!

బైరా: పోలీసుజవాన్ చెప్పిన పోలికలు బట్టి చూస్తే, డైరెక్టరు యీయనే నని పిస్తుంది. హుషార్!

సన్యా: సరే యింకెందు కాలస్యం? పద జల్దీ!

బై స: శరణు శరణు డైరెక్టరుగారూ, శరణు శరణు!

(అంటూ యిద్దరూ వెళ్లి అమాంతంగా ఆయన కాళ్ల మీద పడతారు)

డైరెక్టరు: యెవరు మీరు? యెందుకు నా కాళ్లుపట్టుకున్నారు? వదలండి, లేవండి!

సన్యా: శరణు శరణు డైరెక్టరుగారూ శరణు!

బైరా: అభయ ప్రదానం చేసిందాకా యిక్కణ్నుంచి లేవం.

సన్యా లేకపోతే మీ పాదాలమీదనే చచ్చిపోతాం

బైరా: నీట ముంచినా, పాల ముంచినా మీ పదములే గతి

డైర: అబ్బాయిలూ ముందు మీరెవరో చెప్పండి. యేం గావాలో అడగండి. ముందు అసలు కాళ్లమీదనుంచి లేవండి. నాకంతా అయోమయంగా ఉంది.

సన్యా: మేం దొంగలంగాం, దొరలంగాం.

బైరా: మామీద అరెస్టువారంట్లు లేవు, షూటింగు ఆర్డర్లు లేవు.

సన్యా: యీ మానవసమాజంచేత నిర్దయాత్మకంగా విడనాడబడ్డ నిర్భాగ్య, నిరాధార జీవులం మేం.

బైరా: జ్ఞాపక మెరిగిన లగాయితూ, కేవలం బ్రతికడంకోసం జరుపుతున్న పోరాటంలో నెగ్గలేని మానవులం మేం.

సన్యా: నేను నాటాలు తిని యింటరు ప్యాసయ్యాను.

బైరా: నేను ముష్టెత్తుకుని బియ్యేదాకా చదివా.

సన్యా: యిద్దరంగూడా దరిద్రదేవతకు ముద్దుబిడ్డలం.

బైరా: నిరుద్యోగ నిహతులం, ఆకలి మంట కోర్వలేకున్నాం.

సన్యా: యీ శరీరాలనుండి పోకుండా విసిగిస్తున్న ప్రాణాల్ని బలవంతంగా తీసేయడానికి నిర్ణయించుకున్నాం. కాని మాయందు జాలిగొన్న ఒకానొక మిత్రుడిచ్చిన సలహా ననుసరించి, తమరు ఆర్తత్రాణ పరాయణులనీ,

వైరా: దీనదయాళులనీ, పరార్థ చింతకులనీ,

సన్యా: అర్థించినవారికి చేతనయినంత సహాయంచేసే ఉదారస్వభావులనీ, తమ వద్దకు వచ్చాం.

వైరా: తమ ఆఫీసులో గుమాస్తాలను తీసుకుంటున్నారని విన్నాం.

సన్యా: మాకు ఉద్యోగాలిచ్చి రక్షించాలి. లేకపోతే చచ్చిపోతాం.

వైరా: గుమాస్తాఖాళీలు లేకపోయినా బంట్రోతు పనైనా యిప్పించాలి.

డైర: సరే తెలిసింది. యీ మాత్రానికింత రభస దేనికి? ముందు మీరు లేచి...

సన్యా: యీమాత్రం గాదు, డైరెక్టరుగారూ! యిది మా జీవన్మరణ సమస్య.

వైరా: రభసగాదు మహాత్మా! క్షుధాగ్ని జ్వలిత గర్భగోళనిర్గత దీనాలాపాలివి.

సన్యా: తమరు అభయహస్తం యిచ్చిందాకా లేవం.

వైరా: యిది మా కృతనిశ్చయం.

డైర: ఖాళీ ఉన్నమాట నిజమే. అయితే......

సన్యా: అయితేనంటున్నారు డైరక్టరుగారూ! దీనులం, పతితులం, పీడితులం, నిస్సహాయులం.

వైరా: తమ మొహం చూడంగానే మా కష్టాలన్నీ గట్టెక్కినట్లు భావించాం.

డైర: అబ్బాయిలూ! నే నో మాట చెబుతా వినండి: ముందుకు ముందు నోరు జారి, తర్వాత పశ్చాత్తాపపడే మనిషిని గాను నేను. లేక, యీపో రెండు కబుర్లు చెప్పి, 'చెంగల్పట్టు' చేసి అవతలకు పంపించేవాణ్ని గూడా కాను. యిహ మీరు అధికంగా [illegible]రాంచేసి, అనవసరంగా నాకు కోపం తెప్పించొద్దు. ముందు మీరు లేవండి! (అంటూ యిద్దరినీ చేతులుపట్టుకుని లేవదీసి) ఆ కుర్చీల్లో కూర్చోండి! (మరేం మాట్లాడకుండా, సన్యాసీ వైరాగీ అక్కడున్న కుర్చీల్లో కూర్చుంటారు) ముందు మీ పేర్లేమిటో చెప్పండి!

సన్యా: నాపేరు సన్యాసి.

వైరా: నన్ను వైరాగి అంటారు.

డైర: యేంటి! చాలా వింతగా ఉన్నాయ్యే మీ పేర్లు! సరే దానికేంగాని, మీ దుస్థితి చూస్తే మీకు తప్పకుండా సహాయం చేయాలని ప్రతివాడూ అనుకుంటాడు. ఆఫీసులో యిప్పుడు గుమాస్తాఖాళీలు మూడే ఉన్నాయి. అన్నీ భర్తీ చేశాం. మూడుంటే, యిప్పుడు మీరొచ్చేముందే, ఒక మంత్రిగారు, తన తాలూకు యెవరో యిద్దరు కుర్రవాళ్లున్నారనీ, రెండు గుమాస్తాఖాళీలు రిజర్వుచేసి ఉంచవలసిందనీ, ఫోనులో చెప్పారు. సరేనని ఆయనకు మాట యిచ్చేశాను. పోతే గుమాస్తాఖాళీ ఒకటే ఉంటుందన్నమాట. మీరు యిద్దరున్నారు. మీలో ఒకళ్ళ

ఉద్యోగంయిచ్చి, ఒకళ్లను ఊరకపంపిం చేయడం నా కిష్టంలేదు. యెవరు ఊరు కుంటారో, యెవరు ఉద్యోగం చేస్తారో మీరే నిర్ణయించుకోవాలి. చెప్పండి! రేపే పోస్టింగార్డర్లు వేసేస్తా. తరవాత అనవసరంగా నన్ను నిందించవద్దు. ఉన్న పరిస్థితి చెప్పాను. యిహ మీ యిష్టం. బంట్రోతు ఖాళీలుమాత్రం ప్రస్తుతం లేవు.

భై· స: (నిశ్శబ్దం)

డైరె· మీరు బాగా ఆలోచించుకోండి మళ్లీ యిప్పుడే వస్తా. (అని లోపలకు వెళ్లినట్లే వెళ్లి, చాటుగా వారి సంభాషణ వింటూ ఉంటాడు)

సన్యా యేంరా! మంత్రిగా రేవరో గాని, మననోట్లో తాల్చి దుమ్ముపోశాడు.

భైరా: మన పాలిట పరమశత్రువుగా పరిణమించాడు.

సన్యా: పెద్దచిక్కే వచ్చిం దిప్పుడు.

భైరా: అవును చిక్కుగానే ఉంది. ఉన్నది ఒక ఖాళీ, మనుషులం మాత్రం యిద్దరం.

సన్యా: యెలా మరి?

భైరా. యెలా యేముంది? ఒకరు ఊరుకోవడం, యింకొకరు ఉద్యోగం చెయ్యడం.

సన్యా: యేమంటావ్ మరి?

భైరా: నీ యిష్టం యెలా ఉందో చెప్పు!

సన్యా: నా యిష్ట మేముందని?

భైరా: అయితే ఉద్యోగం నా కివ్వమని అడుగుదాం.

సన్యా· నా కివ్వమని యెందు కడగూడదూ?

భైరా: నీకా! కొంచెం ఆలోచించు సన్యాసీ!

సన్యా. ఆలోచించడాని కేముంది?

భైరా: అయితే నన్నే ఊరుకోమంటావా?

సన్యా· అది నాకేం తెలుసు? నే నెప్పుడూ అలా అనలేదు

భైరా: కొంచెం నిదానంగా పారజూడు. భార్యా యిద్దరు పిల్లలూ, నేనూ నలుగురం నువ్వొక్కడివి. యిందులో ఉద్యోగం యెవరి కెక్కువ అవసరమో గ్రహించు

సన్యా: నేనొక్కణ్నయినంత మాత్రాన ఉద్యోగం చేయగూడదని యెక్కణ్నయినా రాసిపెట్టి ఉందా? నీలాగే నేనూ తిప్పలుబడ్డం లేదా? నేను పెళ్ళి కావల్సినవాణ్ణి

భైరా: నీ చెల్లెలురా సన్యాసీ! నీ మేనల్లుళ్లు. వాళ్లు పస్తులు పడుకుంటూంటే నువ్వు చూస్తూ ఊరుకుంటావటరా?

సన్యా: నీ పెళ్లాం బిడ్డల్ని పోషించుకునే భారం నీది కాని నాది కాదు. లేకుంటే, నాకు చేతనయితే యింత సహాయం చేయొచ్చు. అంతే.

భైరా: అయితే నీ అభిప్రాయం?

సన్యా: తేటతెల్లమే. ఈ ఉద్యోగం మీద నీకెంత హక్కుందో నాకూ అంతే ఉంది. యిప్పుడు నాకు ఉద్యోగమే ఉన్నవంటే, అయిదారు వేలు కట్నంగూడా వస్తుంది.

భైరా: అది గాదు, పోనీ నువ్వు నాదగ్గిరే ఉండు మళ్ళీ ఉద్యోగం దొరికిందాకా.

సన్యా యీ ఛాన్సు పోతే మళ్లీ దొరుకుతుందన్న గ్యారంటీ యేమన్నా ఉందా?

భైరా: పిల్లల్ని అన్యాయం చేయడం నీకు న్యాయం గాదు.

సన్యా: నీ పిల్లల్ని నువ్వు అడుక్కుతిని పోషించుకోవోయ్! నాకేం సంబంధం లేదు. నా అభివృద్ధికి నిష్కారణంగా అడ్డు తగలడం నీకుమాత్రం ధర్మమా?

భైరా: ధా నోరు ముయ్!—యెంతలో కెంత మార్పురా సన్యాసీ!

సన్యా: యిందులో మార్పు లేదు, గిర్పు లేదు. యెవరికి వారే యమునా తీరే ఈ ఉద్యోగం నాకే కావాలంటున్నాను.

భైరా. నీ అవసరం కన్నా నా అవసరం వెయ్యిరెట్లధికం నీ యేకాకిజీవితానికి పని లేకపోయినా ఫరవాలేదు సంగతిసందర్భం డైరెక్టరుగారికి చెప్పుకొని, ఉద్యోగం నాకే యివ్వమని అడుగుతా.

సన్యా. నా మేలు నువ్వు చూడలేకున్నావ్. జాగ్రత! ఉద్యోగం నాకెందు కివ్వగూడదో నేనుమాత్రం అడగనూ?

భైరా: యేడ్వావ్ ఫో!

సన్యా: అఘోరించావ్ లే.

భైరా· నాకోపం వచ్చిందంటే తెలుసునా? ఆఁ.

సన్యా· యేంటి నువు చేసేది? యీ ఉద్యోగం నాకే రావాలి

భైరా: యెంచేసేదీ చూపిస్తా. నాకే కావాలి

సన్యా నాకే... (అంతలో డైరెక్టరు బైటకొస్తాడు)

డైరె: యేమిటి? యేం నిర్ణయించుకున్నారు? ఉద్యోగం యెవరి కివ్వమంటారు?

భైరా· మేం ఒక ఒప్పందానికి రాలేకపోతున్నాం. పోనీ లాటరీ వేయండి. యేంరా ఒప్పుకుంటావా?

సన్యా అవసరం లేదండీ! ఈ ఉద్యోగం నా కివ్వమని ప్రార్థిస్తున్నా

భైరా. అయ్యా! నా పరిస్థితి తెలిస్తే, ఆ ఉద్యోగం నా కివ్వాలనే మీరు నిశ్చయించుకుంటారు నేను పిల్లలుగలవాణ్ణి. వీడు అవివాహితుడు, బాధ్యత తక్కువ.

డైరె· కొంచెం ఆగండి! మీ యిద్దరి కేమన్నా బంధుత్వముందా?

సన్యా బావమరదులమే నండీ!

భైరా. వీడి చెల్లెల్ని నా కిచ్చారు.

అప్పుడే యిద్దరు పిల్లల్ని గూడా కన్నాం. యీ కరువుకాలంలో పెండ్లిచేసుకుని నిలువున కొంపార్చుకున్నా డైరెక్టరుగారూ!

సన్యా. ఆ తెలివితేటలు నీకు ముందే ఉండకర్లా? మమ్మల్ని నిందిస్తావెందుకిప్పుడు నిష్కారణంగా.

డైరె. కొంచెం నిదానించండి! తొందర పడొద్దు.—వెంకయ్యా! అరేయ్!

బైరా: వెంకయ్యెవరు?

డైరె మా యింట్లో పనిచేసే మనిషిలెండి

సన్యా అతన్నెందుకు పిలుస్తున్నారో!

బైరా: అయ్యా! మీరు ఉద్యోగం యిస్తే యిచ్చారు. లేకపోతే లేదు మమ్మల్ని మెడబట్టి బైటకు నెట్టించబోకండి.

డైరె: మీ అధికప్రసంగాన్ని వదిలిపెట్టి, కొంచెం ఊరుకుంటే మంచిదని నా అభిప్రాయం వెంకయ్యా! యిటురారా!

వెంకయ్య (వచ్చి) యేంబాబూ?

డైరె: వీరిద్దరినీ లోపలకు తీసుకెళ్లి స్నానం, భోజనం వగైరా చూడు

వెంక. చిత్తం (సన్యాసీ, బైరాగీ డైరెక్టరుతో యేదో అనబోతారు; వాళ్లను యేమ్మాట్లాడవద్దని డైరెక్టరు వారిస్తాడు. యిద్దరూ వెంకయ్యవెంట దొడిదోవన లోపల కెళతారు)

డైరె: (కుర్చీలో కూర్చొని, కొంచెం సేపు ఆలోచించిన మీదట) వనితా! వనితా!

(ఒక నిముషం అయింతర్వాత వనిత వస్తుంది)

డైరె: వనితా!

వని: యెందుకు పిల్చారు?

డైరె: ఒక ముఖ్యవిషయం మాట్లాడదామని పిల్చా

వని: యేం ముఖ్యవిషయమో యేమో; జాకెం తోచడంలా.

డైరె: అదే ఆలోచిస్తున్నా.

వని: యీ ఆపదనుండి బైటపడేమార్గం కన్పడ్డంలా. అమ్మాయి వారంరోజులనుంచి అసలు బైటకుపోవడమే మానేసింది. ఒంట్లో బాగులేదని యినట్లోనే పండుకుంటుంది.

డైరె: స్థిరపడిపోయినట్లేనా?

వని: యింకా అనుమానం యెందుకండీ! మనం వగుబాట్లయ్యే రోజొచ్చింది

డైరె. పనివాళ్ళకు తెలిసిందా యేం తిప్పలు! వాళ్ళకు తెలిసిందీ అంటే, ఆఫీసంతా యేకొదిలిపెడతారు

వని: యేమో తెలిసిందేమో యిది పైకి పొక్కకముందే యేదోవొకటిచేసెయ్యాలి. లేకపోతే నలుగుర్లో అప్రతిష్ఠ కాదూ!

డైరె: నాకుమాత్రం మనస్సులో పీకుడుగా లేదా? అదే ఆలోచిస్తున్నా.

వని: యింకా ఆలోచనెందుకండీ? మా తమ్ముణ్ని తీసుకొచ్చి, అమ్మాయిని చడీచప్పుడు లేకుండా వాడికి ముడిపెట్టకపోతే, యింకా యేమన్నా ఉందీ! యెన్ని రోజులని యిట్లా?

డైరె: ఛీ ఛీ వాడికా అమ్మాయినిచ్చేది! పొట్టకోసినా అక్షరమ్ముక్క లేదు; పైగా మెల్లకన్ను వాడూ వికారంగా......

వని: అమ్మాయి చేసిన పని తెలిస్తే, పైవాడు మంచివాడొస్తాడటండీ! యెలాగో ఒకలాగు యింట్లోది యింట్లోనే మాపుజేసుకోవాలిగాని.

డైరె: అటు సూర్యుడు యిటు పొడిచినా, అమ్మాయిని ఆ గుడ్డివెధవ కిచ్చేది లేదు

వని: సరే మీ యిష్టం వచ్చినట్లు చేయండి. యింకా రోజులు గడిచినయ్యంటే, లోకం కోడై కూస్తుంది నేను నుయ్యో గొయ్యో చూచుకోవాల్సివస్తుంది.

డైరె: సరేగాని, యింతకుముందు నా దగ్గరకు ఉద్యోగంకోసమని యిద్దరు కుర్రవాళ్లు వచ్చారు చూశావా?

వని చూళ్లా. యెవరో మాట్లాడుతూండడం విన్నాను

డైరె: అందులో ఒకడిపేరు సన్యాసి; ఒకడిపేరు బైరాగి...

వని: సన్యాసీ, బైరాగా! యిదేం విడ్డూరమండోయ్!

డైరె. వాళ్ల పేర్లే అవి సన్యాసి అన్న కుర్రవాడు, అవివాహితుడు; మంచి అందగాడు; యింటరు ప్యాసయ్యాడు. వయస్సుగూడా పాతికలోపేగాని యెక్కువుండదు

వని: బైరాగో మరి?

డైరె: అతనికి పెళ్ళయింది, పిల్లలు గూడా ఉన్నారట. అసలు వీళ్ళిద్దరు బావమరదులట - సరే! ఆఫీసులో ఒక్కటే ఖాళీ ఉంది దానిలో బైరాగిని వేద్దాం. యిహ సన్యాసికి అమ్మాయినిచ్చి పెండ్లి చేద్దాం. అతని కింకా పైకి చదివే అభిలాష ఉంటే చదివిద్దాం. లేకపోతే యెందులోనన్నా ప్రవేశపెడదాం. యేమంటావ్?

వని: యెవరో బజారునబొయ్యే

(39-వ పేజీ చూడండి)

# విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం

## శ్రీ క్రొవ్విడి లింగరాజు

శ్రీపురంలో కొత్తగా స్థాపింపబడిన విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం కలంజీవుల లోకంలో చాలా సంచలనం కలిగించింది. యం. యస్. టి. రావ్ ఎం. ఏ. పిహెచ్ (కార్నెల్), యం. యస్. రమ, బి. ఎ. (యం. ఓ. ఎ) గార్ల సంయుక్త సంపాదకత్వం క్రింద చక్కని ఇంట్లో ఒక్కరోజున నామకులైన పుర ప్రముఖులకు టీ పార్టీ విందుతో ప్రచురణాలయం ప్రారంభమైంది. ఆ రోజునుంచీ విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం ఆకర్షించని కలంజీవి కాని, కుంచెజీవి గాని లేడంటే లేడు. సారస్వతసేవ కంకితులైన ఆ దంపతుల పూర్వచరిత్ర - అంటే వారి పుట్టు పూర్వోత్తరాలు గాని, సాంప్రదాయాలు కాని వారు నిశ్చయంగా తెలుసుకున్న వారు లేరు గాని వాళ్ళ పరిచయ భాగ్యం కలిగినవాళ్ళకి మాత్రం వారి జీవితాంతర్యం అవగాహన కాలేదు. రావ్ గారి మూర్తి విశేషంలో వేషభాషల్లో చాలా ప్రత్యేకత మాత్రం కనిపించుతూ వచ్చింది. బంగారు పద్ధతిగా నిక్కగోచిపోసికట్టిన తెల్లటి పంచె తాలూకు ముందు కుచ్చిళ్ళు ఆయన విజ్ఞానానికి చోపుదార్లు. లోపల ఉన్న బనియను యొక్క స్వరూపాన్నంతటినీ కనబరచే తెల్లని షట్టు లాల్చీ, మధ్యపాపిడితో మెడలవరకు వ్రేలాడుతూ అలరించిన జుత్తు కిచ్చే జుట్టూ, ముఖానికి ఠీకరం కలిగించే నల్లని కళ్ళద్దాలు చూచేవారికి సామాన్యుడికి ఆయన, గొప్ప కవిగానో, కళాకారుడుగానో, లేక ఉద్యమకారుడుగానో స్ఫురింపక మానవు. రమ కూడా ఆయనకు తగినదే. రూపురేఖలనుబట్టి అంతగా కాకపోవచ్చును కాని వేషభాషావిలాసాలవల్ల ఆకర్షణీయమైన వ్యక్తి అని చెప్పాలి. జుట్టు ముడివేసుకోవడం, చెవులకు పెట్టిన ఆభరణాలు బంగాళా పద్ధతిని పోలి ఉండేవి. ఈ దంపతులిద్దరు అధునాతనమైన కుర్చీలు బల్లలతో అమర్చబడిన ప్రచురణాలయ కార్యాలయంలో కూర్చుంటే, వారు ఆకర్షింపని కవి ఎవరు! ఛాందసంగా కవిత్వం గిలుక్కునే పూర్వకవులుకూడా వారి కార్యాలయం తొక్కరంటే నవ్య సాహిత్యోపాసకుల సంగతి చెప్పనక్కరలేదు.

* * *

సాహిత్యోపాసకులతోనూ, కళోపాసకులతోనూ సంపాదకులైన ఆ దంపతులు - లేక ఆ దంపతులైన ఆ సంపాదకులనండి - నడిపిన గోష్ఠి విశేషంవల్ల తెలిసిన విషయాలివి. వారు తెలుగువారేననీ రావ్ గారి పూర్తిపేరు సుందరబుద్ధుల శివకామేశ్వర రావుగారనీ, రమ పూర్తి సుందరమ్మగారనీ వారు మిత్రులయొక్క ప్రోత్సాహంవల్లనూ, సాహిత్య సేవయెడల వారికిగల అభిలాషవల్లనూ, కళోపాసకుల సహాయంతో అంతర్జాతీయమైన నూతనపద్ధతిని గ్రంథ ప్రచురణకు, భారతసంస్కృతిని పరదేశాల్లో విరజిమ్ముటందుకు కొన్ని అపూర్వమైన సచిత్ర వార, మాసపత్రికలను స్థాపించడానికి పూనుకున్నారనీ తేలింది. ఆ దంపతులతో మాట్లాడేటప్పుడు వారెన్నోసార్లు ప్రపంచమంతా, ముఖ్యంగా పాశ్చాత్యదేశాల్లో సంచారం చేసిఉండాలని స్ఫురించక తప్పదు. అక్కడి విషయాలనుగురించి వాళ్ళు చెప్పేటప్పుడు ఎంత నిష్పం కోచంగా ఉండేవంటే ఎవ్వరూ కూడా 'కామెన్నడు రహస్య వక్రత' అని అడగడానికికూడా మాట తోచేది కాదు. ప్రచురణాలయం స్థాపింపబడి నెలరోజులు కాకపూర్వమే వారి కార్యాలయం కలంజీవులతోటి, కుంచెజీవులతోటి కిటకిటలాడుతూ వచ్చింది. వంకపెట్టడానికి వీలులేని దుస్తులతో అలంకరించుకొచ్చిన కవికుమారులు, చలామణి లేని వ్రాత ప్రతులను పాతపత్రికలలో చుట్టి తీర్థయాత్రిలతో గంపెడాశ మాత్రం ముఖంమీద కనబడే వ్రాతగాళ్ళు అందరూ ఆ చావిట్లోనే ఉండేవారు. కలంజీవులకు ఉత్సాహం, ఉత్తేజం కలిగించే కాఫీ పానీయాలు సిగరెట్టుధూపాలు ఆ చావడిలో నిరంతరం వాటి కొరత లేకుండా సరఫరా అవుతూనే ఉండేవి. రావ్ గారు వారిక్కూడా స్వయంగా సేవించ చేయగలిగిన సమర్థులు. తద్వారా ముద్రింపనక్కరలేని యెడల వారికికల అభిరుచి ప్రదర్శించేవారు.

* * *

విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం ప్రారంభమైన ఆరునెలల్లో రెండేసి వందల పేజీల పుస్తకాలు ఆరు వరుసగా నెలవారీగా ప్రచురింపబడ్డాయి. ఆంగ్లానువాదాలు రెండు, హిందీ బంగాళీ అనువాదాలు రెండు, సాహిత్యమీమాంసనుగూర్చిన గ్రంథం ఒకటి, ఒక పిల్ల జమీందారుడైన నవ్యసాహితీపరుని గద్య పద్య కావ్యం. అంటే గద్యంలాంటి పద్యం, పద్యంలాంటి గద్యం కల కావ్యం. ప్రతి పుస్తకంలోనూ రాజపోషకుల శుభనామాలు, మహారాజపోషకుల జీవితసంగ్రహాలు, ఛాయా

(87-వ పేజీ చూడండి)

# బొమ్మరిల్లు



## "తగినశాస్తి"

★

శ్రీ లక్కో్జు వీరభద్రరావు

ఒకానొక ఊరిలోన
వున్నాడొక బడాబాబు.
ఒకనాడు తన చుట్టమునకు
వ్రాయుచుండెనొక జాబు.

ఇంతలోన మిత్రుడొకడు
వచ్చినిలచె వెనుకను.
పెద్దమనిషి యెరుగడనుచు
చదువదొడగ ఉత్తరమును.

చిటికలోన ఈ కిటుకును
కనిపెట్టెను బడాబాబు.
ఏమి యెరుగనట్లాతడు
వ్రాయుచుండె తనజాబు.

తగినశాస్తి చేయనెంచి
తలపోయుచునుండె నతడు.

ఉత్తరమును సగము వ్రాసి
పిమ్మట నిట్లు వ్రాయదొడగె.

"అయ్యా! విషయములు కొన్ని
వ్రాయదలచినాను, మగర్,
వెధవ యొకడు వెనుకనుండి
చదువుచుండె నా లెటర్."

ఇదియు చదివెనా మిత్రుడు
బిక్క చచ్చిపోయె నపుడు.
తగినశాస్తి పొందియతడు
వెనుజూడక తీసె దవుడు

ఒకరు వ్రాయు ఉత్తరమును
యెప్పుడునూ చదువకుమీ!
పై చెప్పిన రీతిని నువు
పరాభవం పొందకుమీ!

—

# పక్షులు



## నారాయణపక్షి

జలం సమృద్ధిగా వున్న ప్రదేశాల్లోను సముద్ర, నదీ తీరాల్లోనూ నారాయణ పక్షులు నివసిస్తాయి. పగటిపూట ఇవి సామాన్యంగా కనిపించవు. గుంపులు గుంపులుగా కూడి ఏ చెట్ల మధ్యనో నిశ్శబ్దంగా గడుపుతాయి. సాయంత్రం చీకటిపడే సమయం నుండి వీటికి చైతన్యం ఎక్కువై రాత్రంతా మేతకోసం తిరుగుతూనే వుంటాయి. ముఖ్యంగా బురద మడుగులలోను, లోతులేని నీళ్లలోను తిండికోసం గాలిస్తాయి. వీటి ఆహారం చేపలు, కప్పలు, బురద పురుగులు మొదలైనవి. ఇవి సమూహంగా వున్నప్పుడు దెబ్బలాటలు కూడా సంభవిస్తాయి. కోపోద్రిక్తమైన పక్షి మెడ నిక్కించి అతివేగంగా తనరొమ్ము, వీపు, మెడమీది ఈకలను కుమ్ముకుంటుంది. ఏప్రిల్, సెప్టెంబర్ నెలలమధ్య, ఎక్కువగా జులై, ఆగస్టు నెలల మధ్య గుడ్లు పెడుతుంది. ఒక్కొక్క సారికి 4, 5 గుడ్లు పెడుతుంది. ఆడ, మగపక్షులు రెండూ గూడు కట్టడంలోను, గుడ్లు పొదగడంలోను, పిల్లలకు మేత పెట్టడంలోను పనిచేస్తాయి. పిల్లలు కొంచెం శక్తి రాగానే కాళ్లతో నడుస్తూ, రెక్కలతో ఎగరటానికి ప్రయత్నిస్తూ చుట్టుపక్కల చెట్లమీదికి పోతాయి. ఈపక్షుల అరుపు కర్ణ కఠోరంగా వుంటుంది.

## కోకిలలు



కోకిలలు భారతదేశమంతటా కనిపిస్తాయి. తోటలు, అడవులు ఎక్కువగా ఉండే ప్రదేశాలలో ఇవి తరుచుకనిపిస్తాయి. కంటికి కనిపించినా కనిపించకపోయినా కోకిలల కూతమాత్రం అందరికీ పరిచితమైనదే. ఎప్పుడూ చెట్లమీదే ఉంటాయిగాని నేలకుదిగవు. శీతకాలంలో కోకిలగొంతు మూగపోతుంది. వసంతఋతువు సమీపిస్తున్న దగ్గిర్నించి, గ్రీష్మఋతువు వెళ్లిపోయిన తరవాతదాకా కోకిల కంఠానికి విశ్రాంతిఉండదు. రాత్రింబగళ్లు అదేపనిగా 'కుహూ కుహూ కుహూ' అనీ, "కూకూ" అనీ

(36-వ పేజీ చూడండి)

## చెల్లాయికి ఉత్తరాలు:

# దేశనాయకుడు గాంధీ

చెల్లీ,

ఎన్నాళ్లయింది నిన్నుచూసి ఈ నాలుగేళ్లలో నువ్వెంత పెద్ద దానివై ఉంటావు? ఈసారివచ్చినప్పుడు నిన్ను చూసి గుర్తుపట్టగలనా? మొన్న నువ్వురాసిన ఉత్తరంచూసి నా ముద్దులచెల్లాయేనా ఈ ఉత్తరంరాసింది, ఇంత చక్కని భాషలో ఇంత చక్కని భావా లెల్లా రాసింది, అని ఆశ్చర్యపోయానంటే నమ్ము సందేహం లేదు, నువ్వు వయస్సుతోపాటు మనస్సులోకూడా పెద్దదానవై వుంటావు ఎప్పుడూ నాలుగు ముక్కలుకంటే ఎక్కువరాయనని కదూ నీకోపం? సరే ఇకనించీ వారంవారం నీకు పెద్దఉత్తరాలు రాస్తాను

గాంధిగారి జీవిత చరిత్ర ఈ మధ్య చదివానని రాశావు ఆయన నిజంగా దేవుడి అవతారమని నమ్ముతున్నట్టు రాశావు బహుశా ఆయన భక్తుడెవరో రాసినపుస్తకం చదివివుంటావు అందుకనే గాంధీగారు "దేవుడితరవాత దేవుడంత" అని రాశావు గాంధీగారుకూడా మానవుడే మనలాగే ఆయనా ఎన్నో కష్టాలు, సుఖాలు అనుభవించాడు మన అందరిలోనూ ఉన్నట్టే ఆయనలోనూ కొన్ని మంచిగుణాలూ, కొన్ని లోపాలూ ఉన్నాయి అందరిలాగే ఆయనా కొన్ని మంచిపనులూ, కొన్ని చెడ్డ పనులూ చేశాడు కావాలంటే ఆయన స్వయంగా రాసిన 'ఆత్మకథ' అనే పుస్తకం చూడు అందులో ఆయన తననిగురించి నిర్భయంగా అంతా రాసుకున్నాడు ఆయన చిన్నప్పుడు ఎంతపిరికిఅంటే



అర్ధరాత్రి చీకట్లో అవతలికి వెళ్ళవలసివస్తే భార్య తోడురాందే కదిలేవాడుకాదు తండ్రి జబ్బుతో మంచానఉండగా తనుభార్యతో కూర్చుని కులాసాగావుండేవాడు ఒక్కొక్కసారి చిన్నచిన్న దొంగతనాలు చేసేవాడు ఇల్లాంటివెన్నో లోపాలు తనకున్నట్టు ఆయన చెప్పుకున్నాడు కాని ఆయనకి మొదటినుంచీ ఒకటే ప్రయత్నం తనలోవున్న దుర్గుణాల మురికిని కడిగేసుకుని స్వచ్ఛమైన, పరిపూర్ణమైన మానవత్వాన్ని సంపాదించాలని ఆయన బతికినన్నాళ్లూ యిదే ప్రయత్నం, యిదే ఆశయంపెట్టుకుని బతికాడు

ఆయన జయించాలని ప్రయత్నించిన దుర్గుణాలేమిటో చెప్పనా? ద్వేషం, భయం ద్వేషమంటే నీకు తెలుసు మనుషులు ఒకరినొకరు ద్వేషించుకోవటంబట్టే ప్రపంచంలో ఇంతపాపం పెరుగుతోంది ద్వేషంవల్లనే ఒకదేశం ఇంకోదేశంమీదికి దాడిచేసి లక్షలకొద్దీ అమాయకులైన ప్రజలను హతమారుస్తోంది ద్వేషంవల్లనే ఒక్కతల్లికన్న అన్నదమ్ములు ఆస్తులకోసం తగూలాడుతున్నారు ద్వేషంవల్లనే లోకంలో ఇన్నిహత్యలు, యుద్ధాలు, నేరాలు, దుఃఖాలు కలుగుతున్నాయి మనిషిమనిషిని ద్వేషించుకోవటం ఎందుకు? ఒకరినొకరు ఎందుకు ప్రేమించుకోరాదూ? అంతా

(35-వ పేజీ చూడండి)

# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

బొమ్మరిల్లు సీరియల్

3

బట్టలు పాడు చేసుకున్నందుకు మర్నాటి ఉదయం మిస్ వాట్సన్ నన్ను చివాట్లు పెట్టింది. అమ్మగారు మాత్రం ఒక్క మాటయినా అనలేదు. బట్టల మీద మసి, దుమ్మూదులిపి శుభ్రం చేసింది. నేను అల్లరిగా తిరుగు తున్నందుకు లోపల లోపలే విచారపడు తున్నట్లు కనిపించింది. ఆమె విచారంచూసి నాకెంతో కష్టంవేసి ఇక వీలైనంత వరకు అల్లరిగా తిరగ కూడదని నిశ్చయం చేసుకున్నాను. మిస్ వాట్సన్ నన్ను దేవుడు గదిలోకి తీసుకుపోయి, మోకరించి ప్రార్థన చేసింది. కాని ఆ ప్రార్థనవల్ల ఏం లాభించిందో నాకు తెలియలేదు.

మిస్ వాట్సన్ చెప్పింది: ప్రతిరోజూ దేవుణ్ణి ప్రార్థిస్తే ఏం కోరుకుంటే అది దొరుకుతుందట. సరే చూద్దామని ప్రయత్నించాను ఈ కొత్తవిద్య. కాని ప్రయోజనం కనపడలేదు. ఒక్కసారి గావును, చేపల గాలం దొరికింది. తీరాచూస్తే దానికిముల్లులేదు. ముల్లు లేందే వట్టిగాలం దేనికిపనికొస్తుంది? ముల్లుకోసం నాలు గైదుసార్లు ప్రార్థించిచూశా. ఊహు. పలకలా. మిస్ వాట్సన్‌ని ఒకరోజు నడిగాను, నాబదులు ప్రార్థించ మని ఆమె నావంక అట్టేచూసి, "ఒరి వాజమ్మా!" అని తిట్టింది. నేను వాజమ్మనెల్లా అయ్యానో ఆవిడ చెప్పనూ లేదు, నాకు తెలియనూలేదు.

ఒకరోజున చెట్లకింద కూర్చుని ఈవిషయం గట్టిగా ఆలోచించాను. ప్రార్థనవల్ల ఏది పడితే అది అయ్యేటట్లయితే అమ్మగారు పారేసుకున్న వెండి పొడుం డబ్బా ఎందుకు దొరకదు? మిస్ వాట్సన్ ఎన్నాళ్లు చూసినా పీలగా వుంటుందిగాని లావెక్క దేం? ఊహు. ప్రార్థనవల్ల ఏపనీ కాదు. అంతా అబద్ధం. ఈసంగతే అమ్మగారితో అన్నాను. ఆవిడేమన్న దంటే ప్రార్థనచేస్తే దేవుడు "ఆధ్యాత్మిక వరాలు" ఇస్తాడట. ఆమాట అర్థం కాకపోవటం అటుంచి, అవేమిటో, వాటిమూలాన ఏం కొంప మునుగుతుందో అని చెడ్డ భయపడ్డాను

నా భయంచూసి అమ్మగారిల్లా చెప్పింది— ఇతరులకు ఎప్పుడూ సేవచేస్తూ వుండాలి; నా బాగో గుల్ని లెక్క చెయ్యకుండా ఇతరుల మంచికోసమే పాటుపడాలి; నన్నుగురించి అసలు ఆలోచించనే కూడదు; ఇతరులను బాగుచెయ్యమనే దేవుణ్ణి నిత్యమూ ప్రార్థిస్తూ వుండాలి.

మళ్లీ చెట్లకిందకిపోయి తీవ్రంగా ఆలోచించాను. ఎంత ఆలోచించినా ప్రార్థనవల్ల నాకేమీ ఒరిగేటట్టు లేదు—ఇతరులు బాగుపడటం తప్ప. 'అబ్బాయ్, మనకిది లాభంలేదు, దాన్నిగూర్చి అట్టే బాధపడటం కూడా ఎందుకు," అనుకుని మనస్సును సమాధాన పరుచుకున్నాను.

ఒక్కోసారి అమ్మగారు నన్నుపిలిచి కూర్చో బెట్టుకుని స్వర్గలోకాన్ని గూర్చి దేవుడు, దేవతలు,

వాళ్ల గొప్పదనాన్ని గూర్చి అద్భుతంగా చెప్పేది. నాకు బలే నోరూరేది. కాని కాసేపటికి మిస్ వాట్సన్ నన్ను పిలిచి నరకలోకం వర్ణించేది. దాంతో వంటి మీద వెంట్రుకలన్నీ దేనికది విడివిడిగా నిక్కబొడుచుకుని, చెప్పలేనంత భయం పుట్టేది. రోజూ యిదేవరస. కొంతసేపు అమ్మగారి స్వర్గం, కొంతసేపు మిస్ వాట్సన్ నరకం—ఈ రెంటి మధ్యా నలిగి సతమతమయ్యేవాణ్ణి.

మా నాన్న ఏడాదినుంచి ఈ ప్రాంతాల్లో ఎక్కడా కనబడటం లేదు. ఏమయ్యాడో గాని నేను మాత్రం వాడు లేకపోవటం మూలాన చాలా సుఖంగా వున్నాను. ఎప్పుడూ ఆ దేవనిగా తాగి, దొర్లేవాడు. అస్తమానం నన్ను పట్టుకుని చితకబాదేవాడు. అందుకనే వాడు ఊళ్లో వున్నంత కాలం నేను అడవుల్లో ఉండేవాణ్ణి. ఈమధ్య మా నాన్న నదిలో మునిగి చచ్చిపోయాడని కబురు వచ్చింది. మా గ్రామానికి పన్నెండుమైళ్ల ఎగువ నదిలో వెల్లకిలా తేలుతూ కనిపించాడట. నేను చూడలేదు గాని, చూసినవాళ్లంతా మానాన్నే అన్నారు. జుట్టు, బట్టలు, లావు—ఇవన్నీ చూస్తే మా నాన్న లాగానే వున్నాడట. మొహం మాత్రం మరోలాగ వుందట. అయితే చాలసేపు నీళ్లలో నానిన తరవాత మనిషి మొహం మనిషి మొహం లాగా వుండమంటే ఎల్లా వుంటుంది? అందుచేత ఆశవాన్ని బయటికి లాక్కొచ్చి ఒడ్డున పాతిపెట్టారు. కాని ఆశవం మానాన్నే అని నాకెందుకో నమ్మకం కలగలేదు. మునిగిపోయింది మొగాడైతే వెల్లకిలా తేలడు; బోర్లా పడుకుని వుంటాడు. అందుచేత ఆశవం మొగబట్టలు వేసుకున్న ఎవరో ఆడమనిషై వుండాలని నిశ్చయించుకున్నాను. కనుక మానాన్న మళ్లీ ఎప్పుడో ప్రత్యక్షం కాక

డన్నీ,' ఎల్లాగురా దేవుడా', అని భయపడ సాగాను.

"టామ్‌సాయర్ ముఠా" వాళ్ల మందరం కలిసి ఒకనెల రోజులుపాటు దొంగలఆట ఆడాము తరవాత నేను రాజీనామా యిచ్చేశాను. మిగతావాళ్లు కూడా రాజీనామా యిచ్చారు. మేము ఒక్కళ్లని చంపలేదు, ఒక్కళ్లని దోచుకోలేదు—ఉత్తుత్తి ఆటలోతప్ప. అడవుల్లోంచి ఎగురుకుంటూ రోడ్డుమీదికి వచ్చేవాళ్లం. దోవనపోయే గొర్రెల కాపర్లను, కూరగాయలు, పువ్వులు మార్కెట్టుకి తీసుకుపోయే ఆడవాళ్లను కొంతసేపు ఏడిపించే వాళ్ళం. కాని ఒకటి రెండు సార్లయేసరికి నాకు ఈ ఆటమీద మోజుపోయింది.

ఒకసారి టామ్‌సాయర్ ఒక కుర్రాడికి దివిటీ యిచ్చి ఊరంతా పరుగెత్తి తిరిగి రమ్మన్నాడు. దివిటీ పుచ్చుకు తిరిగితే ముఠా సభ్యులంతా గుహలో సమావేశం కావాలని అర్థం. సమావేశ మయ్యాక టామ్ చెప్పాడు—గూఢ చారులు తనకొక రహస్యవార్త తీసుకొచ్చారట. ఏమనంటే, మర్నాడు బోలెడుమంది స్పానిష్ వర్తకులు, ధనవంతులైన అరబ్బీలు వచ్చి మాగుహ సమీపంలో విడిది చేస్తారట వారివెంట రెండువందల ఏనుగులు, ఆరువందల లొట్టి పిట్టలు, వెయ్యి గుర్రాలు ఉంటాయట. వాటిమీద రత్నాలు వజ్రాలు, వెలలేని నగలు సంచులకొద్దీ ఉంటాయట. వాళ్లకి నాలుగు వందలమంది మాత్రమే సిపాయీలు రక్షణగా వుంటారట. అందుచేత తేలిగ్గా ఆనాలుగు వందలమందినీ రెండు దెబ్బల్లో సఫా చేసి, ఆధనమంతా దోచుకొందామని టామ్ చెప్పాడు. ముఠా వాళ్లంతా కత్తులు నూరుకుని, తుపాకులు దట్టించి రెడీగా వుండాలన్నాడు.

పువ్వుల బుట్టలు నెత్తిన పెట్టుకుని మార్కెట్‌కి పోయే ఆడపిల్లల్ని కూడా ఎదిరించడానికి దమ్ములులేని టామ్‌సాయర్ అంతమంది మొగాళ్లని, అందులో నిజమైన తుపాకులు, కత్తులు ధరించిన సిపాయిల్ని తేలిగ్గా ఓడించగలమని ఉపన్యసించటం నాకేం నచ్చలేదు. మాదగ్గిర కత్తులూలేవు, తుపాకులూ లేవు. కర్రల్ని చూసి తుపాకులని మేమైతే అనుకోగలం గాని శత్రువులెల్లా అనుకుంటారు?

ఏమైనా స్పానిష్ వాళ్ళని, అరబ్బీలని, లొట్టిపిట్టలు, గుర్రాలు, ఏనుగులు వీటన్నిటినీ చూడచ్చుగదా అని మర్నాడు నేనుకూడా గుహాకి తయారయ్యాను.

తీరాచూస్తే అక్కడ ఏనుగులూ లేవు, గుర్రాలూ లేవు కనీసం మేకపిల్లలైనా లేవు. ఆరోజు ఆదివారమని కొందరు స్కూలుపిలల్లు "పిక్నిక్" కోసం వచ్చారు. వాళ్లైనా బొత్తిగా చిన్నపిల్లలు. మేము వాళ్ళమీదపడి కొంతదూరం తరిమాము. "శత్రువుల" నుండి మేము సంపాయించిన వల్లా కొన్ని బిస్కట్లు, వెన్న. బెన్‌రోజర్స్‌కు మాత్రం ఒక ఆట బొమ్మ, జోహార్పర్‌కి ప్రార్థనపుస్తకం దొరికాయి. ఇంతలో పిల్లలకూడా వచ్చిన మేష్టారు మా దౌర్జన్యం చూసి దగ్గిరికివచ్చి మేము దోచుకున్నవన్నీ మళ్ళీ లాక్కున్నాడు.

నాకెక్కడా రత్నాలు, నగలు కనిపించలేదు. ఆమాటే టామ్‌సాయర్‌తో చెప్పాను. టామ్ జేబుల్లో చేతులు పెట్టుకుని "రత్నాలే కాదు, పచ్చలు' కెంపులు, ముత్యాలుఅన్నీ ఉన్నా" యన్నాడు. "అరబ్బీలతోసహా ఏనుగులు, గుర్రాలు,అన్నీఉన్నా" యన్నాడు. అయితే కనిపించవే మన్నాను.

టామ్—"నువ్వ 'డాన్ క్విక్సాట్' అనే పుస్తకం చదివావా?"

నేను:—"లేదు."

టామ్:—"అందుకే అంత తెలివి తక్కువగా మాట్లాడుతున్నావు. మంత్ర మహిమవల్ల ఇవన్ని కనిపించటం లేదు. ఇక్కడ నిజంగా వందలకొద్దీ సిపాయిలు ఉన్నారు. వాళ్లంతా ఏమయ్యారంటే, మనకి కొందరు శత్రువులున్నారు. వాళ్లని మంత్రగాళ్లంటారు. వాళ్లు సిపాయిల్నందరినీ స్కూలు పిల్లలుగా మార్చేశారు మనమీద కోపం కొద్దీ. అంతేకాని వీళ్లు నిజంగా స్కూలు పిల్లలను కుంటున్నావా?"

నేను:—"అయితే, ఆమంత్రగాళ్లు కనిపించరేం?"

టామ్:—"నీకు బొత్తిగా గ్రహింపు తక్కువరా, హక్! మంత్రగాడంటే ఏమిటను కుంటున్నావ్? వాళ్లకింద బోలెడన్ని భూతాలుంటాయ్. ఆ భూతాలు ఏం చెయ్యమన్నా చేసేస్తాయ్. ఒకటి రెండు మూడు—" అనేలోగా నిన్ను ఐపులేకుండా చెయ్య

గలవు. అవి తాటి చెట్టంత ఎత్తూ, మనచర్చి అంత లావూ ఉంటాయ్"

నేను:—"మనంకూడా భూతాల్ని తెచ్చుకుని శత్రువులమీదికి పంపిస్తే—"

టామ్:—"మనకెక్కడ దొరుకుతాయ్ అవి?"

నేను:—"వాళ్ళ కెక్కణ్ణించి వస్తాయ్?"

టామ్: —"వాళ్లా? పాత లాంతరునో, ఇనప ఉంగరాన్నో గీకుతారు. వెంటనే ఉరుములు, మెరుపులతో భూతాలు వస్తాయి. ఏం చేయమంటే అదల్లా చేస్తాయ్. ఇక్కడున్న చర్చిని తీసుకెళ్లి చైనాలోదింపి రమ్మంటే ఒక్క నిమిషంలో ఆ పనిచేసేస్తాయ్."

నేను:—"మనం చెయ్యమన్నా చేస్తాయా?"

టామ్:—"మనమాట వినవు. లాంతరు నెవరు గీకితే వాళ్లమాటే వింటాయ్. నలభైమైళ్ల పొడుగున బంగారంతో మేడకట్టమని, దాన్ని చాకలెట్లతో నింపమని చెబితే చచ్చినట్లుచేసి తీరతాయ్. చైనా రాజకుమార్తెని పెళ్లి చేసుకోవాల నుంది, తెచ్చి పెట్టమంటే తేవలిసిందే. మర్నాడు సూర్యోదయం కాకముందే ఇదంతా జరగాలంటే ఇక అంతే—ఆమాటకు తిరుగులేదు."

నేను:—"ఆభూతాలువట్టి చవట దద్దమ్మలు కాకపోతే ఆమే డల్ని, రాజకుమార్తెలనీ తమకే ఉంచుకోగూడదూ? నేనే భూతాన్నయితే పాతలాంతర్ను గీకినా సరే, గోకినాసరే ఛస్తే రాను."

టామ్:—"బలే వాడివే హక్! లాంతరు గీకినప్పుడు భూతమయ్యేది గీతమయ్యేది చచ్చినట్టు రావలిసిందే."

నేను:—"ఎందుకు రావాలీ? అందులో చెట్టంత ఎత్తూ, చర్చి అంతలావూ వున్న భూతం?"

టామ్:—"నీకేం తెలియదులే, వూరుకో."

ఈ సంభాషణ జరిగిన తరవాత రెండు మూడు రోజులపాటు తెగ ఆలోచించాను. టామ్ చెప్పింది నిజమో కాదో తేల్చుకోవాలనుకున్నాను. పాత లాంతరొకటి, ఇనప వుంగరం ఒకటి సంపాయించాను. అడవిలోకిపోయి ఎవరూ చూడకుండా ఆరెంటినీ గీకాను. చేతులు నెప్పెట్టి, ముచ్చెమటలు పోసి, స్పృహ తప్పిపోయేదాకా రెంటిని గీకాను. భూతాలొస్తే వాటిచేత మేడకట్టించి తరవాత అమ్మెయ్యొచ్చని నాఆశ. కాని ఒక్కభూతమూ రాలేదు. టామ్‌సాయర్ అబద్ధా లాడటంలో మొనగాడు. ఇదంతా కలిపించి చెప్పిందే ననుకున్నాను. అరబ్బీలు, ఏనుగులు అతను చూశాడేమోగాని నాకెక్కడా కనిపించలేదు. ఎన్నివిధాల చూసినా వాళ్లు స్కూలు పిల్లలుగానే కనిపించారు నాకు.

## 4

మూడు నాలుగు నెలలు ఇలా గడిచాయి. శీతకాలం వచ్చింది. రోజూ బడికిపోయే వాణ్ణి. కొత్తమాటలు కొన్ని నేర్చుకున్నాను. రాయటం, చదవటంకూడా వచ్చింది. 'ఆరేళ్లు ముప్ఫయ్ ఐదు' దాకా ఎక్కాలుబట్టీ పట్టాను. ఆ పైన నా సాధ్యం కాలేదు. జీవితమంతా ఎక్కాలు బట్టీ పట్టినా నాకు అవి వచ్చేటట్లు లేదు. లెక్కలంటే నాకు పెద్ద తలనొప్పి.

మొదట్లో బడిమీద రోతకలిగింది. కొన్నాళ్లకి బడిబతుకు అలవాటైంది. పాఠాలు విసుగు పుట్టినప్పుడు బడి ఎగకొట్టేవాణ్ణి. మర్నాడు మేష్టారు బెత్తం పుచ్చుకుని వుతికినప్పుడు హాయిగా వుండేది; 'రోజులు మరీ దిగులుగా లేవు' అనిపించేది. అమ్మగారి యింట్లో పరిస్థితికూడా అంత నిరుత్సాహంగా లేదు. మొదట్లో, కొంత యిబ్బందిగా వుండేది—ఒక శుభ్రమైన యిల్లు, శుభ్రమైన పడక, శుభ్రమైన బట్టలు—ఇవన్నీచూసి బేజారెత్తిపోయాను గాని అడపా తడపా రాత్రిళ్లు ఇంట్లోంచి పారిపోయి అడవిలో పడుకుని, చీకటితోనే మళ్ళీ వచ్చేసేవాణ్ణి. నా పాత జీవితంమీద అభిమానం పోలేదు కాని కొత్త జీవితంలో కొంచెం ఆకర్షణకూడా కనిపించ సాగింది. అమ్మగారు నేను క్రమంగా "ఒకదోవకి వస్తున్నా" నన్నది. బాగుపడే లక్షణాలు కనిపిస్తున్నాయన్నది. నన్నుగురించి యిప్పుడు లజ్జించే అవసరం లేదన్నది.

ఒకరోజు ఉదయం నేను నిద్రకళ్లతో వస్తూ పొరపాటున ఉప్పుబుట్ట తన్నేశాను. అది అపశకునం. ఏదో కీడు మూడుతుందని భయపడ్డాను. కొంత ఉప్పు ఎడమ బుజంమీదుగా వెనక్కి గిరాటేస్తే దానికి విరుగు డౌతుంది. అలా చేద్దామనుకున్నాను. ఇంత

లోకి మిస్ వాట్సన్ వచ్చింది. ఉప్పు పారబోసినందుకు నన్ను చివాట్లు వేయసాగింది. "ఎన్నేళ్లొచ్చినా సరిగ్గా నడవటమే రాదునీ" కన్నది.

నేను విచారంగా అవతలికి వెళ్లిపోయాను. ఏకీడు రాబోతోందో అని భయపడ్డాను. తోటలో తిరుగుతూ కంచెవరకూ వెళ్లాను. నేలమీద కొత్తగా ఒక అంగుళం మందాన మంచు కురిసింది. మంచుమీద ఎవరివో కాలిజాడలు కనపడ్డాయి. కొండ వైపు నుండి వచ్చివచ్చి సరిగ్గా మా కంచెవద్ద ఆగిపోయాయి. ఆవచ్చిన వాడెవడో, కంచెవరకూ వచ్చి లోపలికెందుకు రాలేదో నాకు అర్థంకాలేదు. 'తమాషాగా వుందే,' అనుకుంటూ కాలిజాడ లెక్కణ్ణుంచి వచ్చాడో చూద్దామని బయల్దేరాను. అప్రయత్నంగా వంగి పరీక్షగా చూశాను. మొదట ఏ విశేషమూ కనిపించ లేదుగాని, బాగా చూసేసరికి, ఎడమ కాలి బూటుముద్రలో 'శిలువ' గుర్తు కనిపించింది. దెయ్యాలు వెంటబడకుండా కాపుదల కోసం బూటు అడుగున ఆగుర్తు చెక్కబడింది.

మరొక సెకను గడిచేలోగా నాకు సంగతంతా అర్థమైంది. ఆలోచించుకో వలసినదంతా ఆ సెకనులోనే ఆలోచించాను. వెంటనే దౌడుతీశాను ఆ పరిగెత్తటం పరిగెత్తటం జడ్జి థాచర్ గారింటికి వచ్చేవరకూ ఎక్కడా ఆగలేదు. ఆయన నన్ను చూడగానే,

"ఏమబ్బాయ్? అల్లా పరుగెత్తుకొచ్చావు? వడ్డీకోసమా? అన్నారు.

"కాదండి."

"మరేమిటి?"

"నాకేమన్నా వడ్డీ రావలసి వుందా?"

"ఆ. నిన్నటికి అర్థసంవత్సరమైంది. వడ్డీ నూటయాభై డాలర్లు. చాల ఎక్కువే. అంత డబ్బు నీ చేతికిస్తే తగలేస్తావ్. అందుచేత నీ ఆరువేలతో పాటు అదికూడా బ్యాంకిలో వేస్తాను. ఏం? ఏమంటావ్?"

"వద్దండి. నే నాడబ్బు తగలెయ్యను. అసలు నాకది అక్కర్లేదు. ఆరువేలూకూడా వద్దు. అంతా మీరే తీసుకోండి. ఆరువేలు, దానిమీద వడ్డీఅంతా మీకిచ్చేస్తాను."

జడ్జిగారాశ్చర్యపోయారు. ఆయనకి నామాటలర్థం కాలేదనుకుంటా.

"నువ్వనేది నాకేమీ బోధపడటం లేదు."

"మీరు నన్నేం అడక్కండి సాబ్. డబ్బు తీసేసుకోండి. తీసుకుంటారు గదూ?"

"అసలు సంగతి ఏమిటి?"

"తీసుకోండి ప్రశ్నలేం అడగొద్దండి. లేకపోతే నేనబద్ధాలు చెప్పాల్సొస్తుంది."

కొంచెం ఆలోచించారు జడ్జీగారు. "ఓహో— అదా? సంగతి. నువ్వు నీఆస్తి నాకమ్మెయ్యదలిచావన్నమాట. ఊరికే ఇవ్వటంలేదు, అమ్ముదామనుకుంటున్నావు. అంతేనా?"

అంటూ ఆయన కాగితం, కలంతీసి ఏదో రాశారు. తరవాత ఆకాగితం నాకు చూపించి,

"ఇదిగో పత్రం. నువ్వు నీ ఆస్తి నాకమ్మావని, నీకు డబ్బిచ్చేశానని రాశాను. సరిపోయిందా? ఈ డాలర్ తీసుకో, యింద. ఊ. ఇక్కడ సంతకంపెట్టు."

సంతకం పెట్టి వెనక్కొచ్చేశాను.

మిస్ వాట్సన్‌గారి నీగ్రోబానిస జిమ్ దగ్గిరికి వెళ్లాను. వాడిదగ్గర ఒక 'మంత్ర యంత్రం' వుంది. దాంతోవాడు మాజిక్ చేసేవాడు. యంత్రంలో ఒక దేవత వుందనీ, దానికి భూప్రపంచంలో వున్న అన్ని సంగతులూ తెలుసనీ చెప్పేవాడు. వాడితో చెప్పుకున్నాను నా అవస్థ. మానాన్న మళ్ళీ ఊళ్లోకి వచ్చాడనీ, మంచులో వాడి అడుగుజాడలు అవుపించాయనీ చెప్పాను మానాన్న ఏం చెయ్య దల్చుకున్నాడో, ఎంతకాలం ఊళ్లో వుంటాడో యంత్రంవేసి చెప్పమన్నాను. జిమ్ తనయంత్రం బైటికి తీశాడు. దాంతో ఏమిటో మాట్లాడాడు. ఎత్తి పట్టుకుని నేలమీద జారవిడిచాడు. అది కొంతదూరం దొర్లింది. మళ్లీ ఎత్తి పట్టుకుని జారవిడిచాడు. మళ్ళీ అలాగే దొర్లింది. ఇలా ఎన్నిసార్లు చేసినా అలాగే జరిగింది. తరవాత దాన్ని చెవిదగ్గిర పెట్టుకుని జాగ్రత్తగా విన్నాడు. ఊహు. దేవత పలకలేదు. దేవతకి అప్పుడప్పుడు డబ్బు అవసర మవుతుందనీ, డబ్బిస్తేగాని పలకదనీ అన్నాడు. నాదగ్గిర ఒక పావుడాలర్ నాణెం వుందన్నాను. అది వెండిపూత పూయబడిన నత్తు నాణెం. బజార్లో చెల్లదు. ఎందుకంటే అక్కడక్కడ వెండిపూత పోయి

సత్తు కనిపిస్తోంది. సత్తు కనిపించకపోయినా నేలమీద మోగిస్తే దాని సత్తుదనం గుడ్డి ముండకూడా తెలిసిపోతుంది. ఈసంగతి జిమ్‌తో చెప్పాను. "ఏదీ చూద్దాం ఇమ్మ"న్నాడు. ఇచ్చాను. (నా జేబులో జడ్జీగారిచ్చిన డాలర్ వున్నది. అయినా దాన్ని బయట పెట్టదల్చుకోలేదు కనుకున్నాను.) జిమ్ సత్తు నాణెం తీసుకున్నాడు. ముందు వాసన చూశాడు. కొంచెం రుచి చూశాడు. కొరికాడు. చేతిమీద రుద్దాడు. "ఫరవాలేదు. ఇది సత్తు నాణెమని యంత్రానికి తెలియకుండా మోసంచెయ్యొ"చ్చన్నాడు. "బంగాళ దుంపను అడ్డంగాకోసి నాణెం దానిమధ్య పెట్టి ఒక రాత్రల్లా వుంచితే, మర్నాటికల్లా అది వెండి నాణెం మల్లే మారి పోతుందన్నాడు. యంత్రంకాదు, యంత్రంలోని దేవతకాదు, యంత్రంలోని దేవతబాబుకూడా అది సత్తునాణెం అని కనుక్కోలేడన్నాడు. బజార్లో ఎవరైనా సరే దాన్ని తీసుకుంటారన్నాడు. బంగాళా దుంప అలా చెయ్యగలదని నాకూ తెలుసు. కాని సమయానికి మరిచిపోయి అది కాస్తా జిమ్ చేతులో పెట్టాను.

జిమ్ సత్తు నాణెం యంత్రంకింద పెట్టి మళ్ళీ విన్నాడు. ఈసారి దేవత పలికింది. కావలిస్తే నాజాతకం యావత్తూ చెబుతానంది చెప్పమన్నాను. దేవత జిమ్ చెవిలో చెప్పింది. జిమ్ నాతో చెప్పాడు:

"మీ నాయన ఏం చేద్దామనుకుంటున్నాడో మీ నాయనకే తెలీదు. ఒక్కొక్కసారి వెళ్ళిపోతానంటాడు. ఉంకోసారి ఉంటానంటాడు. నువ్వేం చెయ్యబోకు హాక్! మీ నాయనని చేసేదేదో చెయ్యనియ్ నువ్వు గాబరా పడొద్దు మీ నాయన నెత్తిమీద రెండు దేవతలు తిరుగుతున్నాయి. ఒక దేవత తెల్లది. ఉంకో దేవత నల్లది. తెల్ల దేవత మీ నాయన్ని మంచిదోవకి తీసుకొస్తే, నల్లదేవత చెడ్డదోవకి లాక్కెడుతోంది. చివరికేం జరుగుతుందో మా దేవతకూడా తెలియదంట. కాని నీకేం పరవాలేదు. నీకు కొన్ని కష్టాలొచ్చినా, సుఖాలుకూడా వస్తాయి. ఒక్కొక్కసారి నీకు దెబ్బలు తగుల్తాయి. ఒక్కొక్కసారి జరమొస్తుంది. అయినా మళ్ళీ నయమవుతుంది. నీమీద ఇద్దరమ్మాయిలు కన్నేశారు. ఒకమ్మాయి తెల్లది. ఉంకోమ్మాయి నల్లది. తెల్ల దాందగ్గర డబ్బుంది. నల్లమ్మాయి బీదది. బీదమ్మాయిని ముందు పెళ్ళిచేసుకుంటావు, తరవాత్తరవాత తెల్లదాన్ని చేసుకుంటావు. నీకు నీళ్లంటే భయం. ఎందుకంటే నీకు జలగండం వుంది."

జోస్యం విన్నాక నాదిగులు ఇంకా ఎక్కువైంది నాగది తలుపుతెరిచి లోపలికి పోయాను. నిద్రపోతే దిగులు తగ్గుతుందని పించింది. తలుపు గడియవేసి కొవ్వొత్తి వెలిగించాను తలెత్తి చూస్తే కుర్చీలో ఎలుగ్గొడ్డులాగా కూర్చుని వున్నాడు— మానాన్న!

(ఇంకావుంది)

# కలికాలపు పతివ్రత

## శ్రీ పి.వి.యస్.పి. రంగారావు

అనగనగా ఒక వూరు. ఆ వూళ్లో ఒక పెద్దరెడ్డి ఆ రెడ్డికో భార్య. వాళ్లకు వూరుచివర ఒక ఎకరం మాగాణి - స్వంత సేద్యం—

ఆరోజు పెదరెడ్డి పొలానికి వెళ్లుతూ భార్యను పిలిచి "ఏమేవ్! యీరోజుకుప్ప వేత కనుక భోజనము నకు యింటికివచ్చుటపడదు. కనుక నీవే పదిన్నర అయేసరికల్లా భోజనము పొలానికి తీసుకొనిరావలెను. ఆలస్యముచేసినా వానే నుండలేను. త్వరగా పని తెముల్చుకుని రా!" అనిచెప్పి వెళ్ళిపోయాడు -

పెదరెడ్డి భార్య ఆరోజు తల - చాలా చిరాకుగా యుండుటచే తలంటి నీళ్లు పోసుకొనెను. నీళ్లు పోసుకోవడం పూర్తిఅయేసరికి 10 దాటినది. ఇంతలోనే పక్కింటి పుల్లమ్మవచ్చి ఏదో సంగతి చెపుతోంటే అలా ఒక పావుగంట గడిచిపోయింది.

"ఇంతవరకూ పొయ్యిమీద కుంపటి ఎక్కించలేదు. మరి ఇక ఎప్పుడు వండి ఎప్పుడు పట్టుకుని వెళ్ళను. అసలే ఆయన చాల కోపదారిమనిషి. రెండుమైళ్లునడచి వెళ్లాలే! ఎలారా! దేముడా" అని ఒకనిముషం ఆలోచించింది పెదరెడ్డి భార్య. చివరకో ఆలోచన తట్టింది. వెంటనే నాలుగు వంకాయలు తరిగి ముక్కలుచేసి ఒక గిన్నెలోనూ, కొంచెమునీళ్లు ఒక గిన్నెలోనూ, తవ్వెడుబియ్యం మరొక గిన్నెలోనూ పోసింది— ఆ గిన్నెలు మూడూ గంపలోపెట్టి పైని గుడ్డమూతవేసి నెత్తినెట్టుకుని పొలానికి బైలుదేరింది—

ఇక అక్కడ పొలానికివెళ్లిన పెదరెడ్డి ధాన్యం కుప్పవేతలో చాల అలసివున్నాడేమో చాలా ఆకలిగా ఉన్నది. సూర్యుడు నడినెత్తికి వస్తున్నా భార్యజాడ ఎక్కడా కనుపించుటలేదు ఆకలితో కడుపు దహించుకుపోతోంది. భార్యపై బలేకోపం వచ్చింది. "రానీ దాని తలసీగొయ్యా! యీరోజుదాని భరతం పట్టేనే!" అంటూ పక్కనున్న పార, చేత్తోపట్టుకుని గట్టుచివరకువచ్చి చూస్తున్నాడు.—

ఇంతలోకే ఆమడదూరంనుంచి భార్యనెత్తిమీద గంపపెట్టుకొని ఒయ్యారంగా తిప్పుకుంటూ రావడం చూచేడు. "దీనికి బాగా బుద్ధిచెప్పాలి" అని లేచి నుంచున్నాడు చేత్తో పారతోసహా. తీరా భార్య దగ్గరకువచ్చేసరికి ఎక్కడ పారతోకొట్టితే భార్య చస్తుందో అని పార క్రిందపడేసి సాచిపెట్టి ఒక్కలెంపకాయ వేసేడు. దానితో ఆవిడకు ఎక్కడలేని కోపమూ ఆవహించినది. వెంటనే నెత్తిన వున్నగంప క్రిందపడేసి - "ఓ భగవాన్! నేనేకనుక పతివ్రతనైతే అన్నమంతా బియ్యం కాను, చారంతా నీళ్ళుకానూ, కూరంతా ముక్కలుకానూ" అని శపించింది-

పెదరెడ్డి గంపపైగుడ్డతీసి చూచేసరికి ఏముంది. బియ్యం, నీళ్లు, ముక్కలూ విడివిడిగా కనుపించాయి.—

భార్యచేసిన పన్నాగం అతనికేం తెలుసు! అదిఅంతా భార్య శాపంవల్ల కల్గిన ప్రభావమే అనుకొని ఆరోజుమొదలుకొని భార్యను పువ్వుల్లోపెట్టి చూసుకుంటున్నాడు పెదరెడ్డి— 

# "చ"కారకుక్షి

శ్రీమతి డి. పార్వతి

కాళిదాసుపేరు వినని భారతీయులుండరుగదా! పాపాయిలూ? ఆయన యెంత గొప్పకవియో అంత చమత్కారి కూడాట. ఒకమాటు ఆయన కాశీక్షేత్రం చూడ్డానికి వెళ్లాడు. గంగా స్నానంచేసి విశ్వేశ్వరుణ్ణి సేవించి కాశీ ప్రక్కనేఉన్న వ్యాసకాశీ చూడబోయాడు. అక్కడ వ్యాస మహర్షి విగ్రహం పెద్దది ఒకటున్నదిట. ఆ విగ్రహాన్ని చూసీ చూడ్డంతోటే కాళిదాసుకి చటాల్న ఒక విషయం జ్ఞాపకం వచ్చింది. అదేమిటంటే వ్యాసుడు మహాభారతమునకు కర్త. ఆయన దానిలో "చ"కారం తెగ వుపయోగించాడు. అందుకని కాళిదాసు నవ్వుతూ ఆ విగ్రహంబొజ్జ తడుముతూ బొడ్డులో వేలుపెట్టి "చకారకుక్షీ క్షేమమా?" అన్నాడు. ఇంకేముందీ వ్యాసునికి తనంతటి వాణ్ణి పట్టుకొని వెక్కిరిస్తాడా! అని కోపం రానూను, బొడ్డులోవేలు బొడ్డులో బిగించి ఊరుకొన్నాడు. మన కాళిదాసుగారి వేలు బొడ్డులోంచి రాకుండా బిగుసుకుపోయింది. కాళిదాసుకి విషయం తెలిసింది. "ఓస్ యింతేకదా! వేలు రాకపోతే పోయింది: ఎంతసేపు బొడ్డు బిగించుకు కూచుంటావో నేనూ చూస్తాను" అని అట్లానే నుంచున్నాడు.

కొంత సేపటికి వ్యాసుడు ఒక బ్రాహ్మణ వేషంలోవచ్చి "యిదేమిటయ్యా, ఆవిగ్రహం బొడ్డులో వేలు పెట్టి నుంచున్నావు? నీ కేమైనా పిచ్చా?" అన్నాడు. దానికి కాళిదాసు జరిగిన కథంతా చెప్పి "అయ్యా యిది యెంత సబబుగా ఉందోమీరే ఆలోచించి చెప్పండి. నేను అన్న మాటలో యేమైనా అబద్ధం ఉందా?" అని అడిగాడు. అప్పుడు వ్యాసుడు నిజస్వరూపంతో "నాయనా! నేనే ఆవ్యాసుణ్ణి నేను భారతం చెప్పేటప్పుడు ఒక నిబంధన పెట్టాను. నేను కథ చెప్పుకు పోతూంటే ఒకళ్లు వ్రాయాలని, అలా వ్రాసే వ్యక్తి చెప్పింది తిరిగి చెప్పమని అడగ కూడదనీ అలా అయితేనే నేను భారతం చెప్తాననీ పంతం పట్టాను. దానికి ముక్కోటి దేవతలూ నిర్ఘాంతపోయి చేసేది లేక నోళ్లు వెళ్లబెట్టారు. అప్పుడు వినాయకుడు తను వ్రాస్తాననీ, కాని నేను చెప్తూ చెప్తూ కథ ఎంతదాకా చెప్పానూ, అని అడగ కూడదనీ నిబంధన పెట్టాడు సరే, నేను ఒప్పుకొని కథ చెప్పాను; అతను వ్రాశాడు. ఆకారణంతో అన్ని 'చ' కారాలు వాడాల్సి వచ్చింది. అయినా నువ్వు నన్ను పట్టుకు వెక్కిరించావే?, చూద్దాం "చ" కారం వాడకుండా ద్రౌపదికి పంచ పాండవులు యేమవుతారూ? యేయే వరసగా ఉంటారూ? ఈవిషయం చకారం లేకుండా ఒక్క పద్యంలో చెప్పు అని సవాలు చేసేడు.

కాళిదాసుకేమైనా చేతకానివాడా? ఒక్క క్షణం ఆలోచించిఒక్క అనుష్టుపు శ్లోకంలో వర్ణించాడు:

ద్రౌపద్యాః పాణ్డుతనయాః
భర్తృదేవర భావుకాః
న దేవరో ధర్మరాజ
స్సహదేవో న భావుకః॥

అంటే: ద్రౌపదికి పంచ పాణ్డవులు భర్తలు, మరుదులు బావగారు అవుతారు. ధర్మరాజు యెప్పుడూ మరదికాడు సహదేవుడు యెప్పుడూ బావగారుకాడు, అని.

ఈ శ్లోకం వినే టప్పటికి వ్యాస మహర్షి చాలా సంతోషించి బిగించిన వేలు విడిచిపెట్టి నువ్వ

(34.వ పేజీ చూడండి)

# బాబు

## "జ్యోతిర్మయి"

మా చిన్న తమ్ముడు బాబు, ఎప్పుడూ అల్లరి చేస్తూ వుంటాడు వాడి సందేహాలను శాస్త్రజ్ఞులుకూడా తీర్చలేరు వాడి వయస్సు నాలుగు సంవత్సరాలు. ఒకరోజున అల్లరిచేస్తూ వుంటే మా అమ్మ వాణ్ణి తీసుకుపోయి ఆడించ మని చెప్పింది.

"బాబూ కథ చెపుతా వింటావా" అన్నాను. వాడు కథలంటే చెవి కోసుకుంటాడు.

"కథలు, కథలు" అని పరుగెత్తు కుంటూ వచ్చాడు. నేను కథ చెప్ప మొదలు పెట్టాను.

"పూర్వకాలంలో ఒకరాజు ఉన్నాడు. ఆరాజుకి భార్య ఉన్నది. ఆభార్య నేమంటారో తెలుసా" అన్నాను.

"రాణి" అన్నాడు.

"ఆ రాణికి పిల్లలు లేరు" అన్నాను.

"రాజుకీ" అన్నాడు.

"రాణికి లేకపోతే రాజుకెలా వుంటారు" అన్నాను.

"సరే లేరు" అన్నాడు కథ వినవలెననే ఉత్సాహంతో. అల్లరి మానాడు కదా అని మొదలు పెట్టాను. "ఆరాజు తపస్సు చేయటానికి అరణ్యానికి వెళ్ళాడు. కొన్నాళ్ళకు దేముడు కనిపించాడు" అన్నాను.

ఆ మాటతో ఒక్క గంతు వేశాడు. "ఏమిట్రా" అన్నాను.

"నేను దేముణ్ణి చూశాను. దానికోసం తపస్సు చేయాలా" అన్నాడు.

"ఎక్కడ చూశావురా దేముణ్ణి" అన్నాను.

"నిన్న అమ్మతో గుళ్ళోకిపోతే దేముణ్ణి చూపించి దణ్ణం పెట్టమంది. ఆయనేగా దేముడంటే" అన్నాడు విజయ గర్వంతో. వాడికి ఏమి చెప్పాలో తోచలేదు. "ఆ! ఆయనే దేముడంటే" అన్నాను.

"ఊ, సరే చెప్పుకథ" అన్నాడు.

మళ్ళీ మొదలు పెట్టాను. "ఆ దేముడు కనిపించి వరం కోరుకో" మన్నాడు రాజును, అని అనేసరికి బాబుకు కోపం వచ్చింది. వాడి ముఖంలోవున్న కోపం దైన్యము చూచేసరికి జాలివేసి "ఏమిట్రా అనుమానం" అన్నాను:

"నిన్న నాతో మాట్లాడని దేముడు ఆరాజుతో ఎట్లా మాట్లాడాడు?" అయినా కనుక్కుంటానని పరుగెత్తటం మొదలు పెట్టాడు.

వాడివెంట బయలుదేరి వాడిని పట్టుకొని "ఇప్పుడు కాదు బాబూ సాయంత్రము గుళ్ళోకి వెళ్ళినప్పుడు అడుగుదాముల్లే" అన్నాను.

"సరే" అని కథ చెప్పమన్నాడు

"దేముడు రాజుకొక కొడుకు పుట్టునని చెప్పి మాయ మయ్యాడు. ఆరాజు యింటి కొచ్చిన తరువాత కొన్నాళ్ళకు ఒక కొడుకు పుట్టాడు" అన్నాను.

"రాజు కొడుకు పేరేమిటి" అన్నాడు ఆత్రంతో.

"బాబు" అన్నాను మెల్లగా నవ్వుతూ.

"ఛీ! నాకు కథవద్దు! ఏమి వద్దు పో" అన్నాడు యింట్లోకి పరుగెత్తి పోతూ. మాబడికి వేళ కావటం వల్ల బడికి పోయినాను. ★

---

ప్రపంచఖ్యాతి పొందుతావు. నిన్ను మించిన కవిలేడు" అని ఆశీర్వదించి అంతర్థానము చెందాడు. చూశారా కాళిదాసు ఎంత చమత్కారో, ఎంత పండితుడో. మీరుకూడా ఆయన కావ్యాలు చదివి గొప్పవాళ్లు కావాలి. ★

## దేశనాయకుడు గాంధీ

(25-వ పేజీ తరువాయి)

మంచిగా, ప్రేమగావుంటే ఈరోజున కన్నీళ్ల సెలయేళ్లు ప్రవహిస్తున్న ఈ దేశాలన్నీ పువ్వుల తోటలు కావూ? ప్రేమఅనే పవిత్రమైన గంగానదిలో స్నానం చేస్తే మనిషి దేవుడై పోడూ?

ఇదిగో, యీ విధంగా ఆలోచించాడు గాంధీగారు. రెండువేల ఏళ్ల కిందట ఏసుక్రీస్తు, ఇంకా పూర్వం బుద్ధుడు ఆలోచించినట్టే గాంధీగారు కూడా ఆలోచించాడు. ఆలోచించటమే కాదు, ఆచరించటం కూడా మొదలెట్టాడు. ఎలాగంటావేమో, చెబుతా విను.

మన దేశాన్ని నాలుగేళ్ల కిందటిదాకా బ్రిటిష్ వాళ్లు పరిపాలించేవాళ్లు. మన దేశంతో మొదట వర్తకం చేసుకోడానికి వచ్చి, మనలో మనకు పోట్లాటలు పెట్టి, మొత్తానికి దేశాన్నంతా స్వాధీనం చేసుకున్నారు. మన దేశపు సంపదనంతనీ పీల్చి మనను పిప్పి చేశారు ఆ బ్రిటిష్ వాళ్లను, వాళ్ల పరిపాలనను ఎల్లాగైనా తప్పించాలని, స్వరాజ్యం తేవాలని గాంధీగారు పోరాడాడు. ఇది వరకల్లా ఏ దేశమైనా స్వతంత్రం కావాలంటే, ప్రజలు కత్తులు, కఠార్లు పుచ్చుకుని పరదేశ ప్రజలతో యుద్ధం చేసేవాళ్లు. ఆ యుద్ధంలో వీళ్లలో కొందరు, వాళ్లలో కొందరు, నిజంగా దుష్టులైనవాళ్లూ, ఏపాపం ఎరగనివాళ్లూ కూడ చచ్చిపోయేవాళ్లు. యుద్ధమైపోయింతరవాత ఈ దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా, ఆ దేశం ఓడిపోయినా, రెండు దేశాల్లోనూ చచ్చిపోయిన వాళ్ల రక్తపు కాలవలు, చచ్చిపోయిన వాళ్ళకోసం ఏడ్చే తల్లుల, తండ్రుల, బంధువుల కన్నీళ్ళ కాలవలు కలిసి ప్రవహించేవి. యుద్ధం అయిపోయినా అంతకు ముందునుంచీ ఉన్న ద్వేషం, పగ అల్లాగే మిగిలిపోయేవి.

గాంధీగారు "ఛా, ఇదేం బాగాలే" దనుకున్నాడు. కొత్త ఉపాయం కనిపెట్టాడు. కొత్త ఆయుధం తయారుచేశాడు దాని పేరు ప్రేమ. ఈ ప్రేమతో, హింస అనేది లేకుండా బ్రిటిష్ వాళ్ళను జయిస్తానన్నాడు. "మీ పరిపాలన మాకక్కర్లేదు మాకు మేమే పరిపాలించుకుంటాం. మీ పెత్తనం మీ శాసనాలు, చట్టాలు, మేము అంగీకరించం," అనమన్నాడు. ప్రజలంతా ఆమాటే అన్నారు. "బ్రిటిష్ వాళ్లు నిజంగా చెడ్డవాళ్లు కారు. వారూ మనలాటి మానవులే. మానవులెవ్వరూ చెడ్డవాళ్లు కారు. మనం ద్వేషించాల్సింది మానవుల్లో వున్న చెడ్డతనాన్నేగాని మానవుల్ని కాదు. అందుచేత బ్రిటిష్ వాళ్లలో వున్న చెడ్డతనాన్నే మనం ద్వేషించాలి, దాన్నే మన దేశంనుంచి వెళ్లగొట్టాలి. అంతే కాని బ్రిటిష్ వాళ్ళని కాదు" అన్నాడు గాంధీగారు. ప్రజలంతా సరే నన్నారు "నా వెంటరండి. మిమ్మల్ని కొత్త ప్రపంచంలోకి తీసుకుపోతా" నన్నాడు. వస్తామన్నారు ప్రజలు.

మన దేశానికి స్వరాజ్యం వచ్చి నాలుగేళ్లయింది. బ్రిటిష్ వాళ్లు మన దేశం మనకు అప్పజెప్పి, మూటముల్లె కట్టుకుని వెళ్లి పోయారు. స్వరాజ్యం వచ్చిన అయిదు నెలల పదిహేను రోజులకి, సరిగ్గా ఈ రోజునే గాంధీగారు చనిపోయాడు. ఆయన్ని ఒక హిందువు తుపాకి కాల్చి చంపేశాడు. గాంధీగారికి హిందువులమీద కంటే మహమ్మదీయులమీదే ఎక్కువ ప్రేమఅని కోపంవచ్చి ఒకపిచ్చివాడు ఆయన్ని చంపేశాడు.

మన నాన్నగారేవున్నాడనుకో, ఆయనకి నీమీద, నా మీదకూడా సమానంగా ప్రేమవుంటుంది. మన మిద్దరం గిల్లి కజ్జాలు పెట్టుకుంటే ఆయన నన్ను "పెద్దవాడివై వుండి చిన్న పిల్లతో దెబ్బలాడతావుట్రా" అని మందలిస్తారు. అంత మాత్రాన నామీదకంటే నీమీదే ఎక్కువ

ప్రేమఅని నేను కోపగిస్తే మంచిదేనా? అల్లాగే మన దేశంలో హిందువులు ఎక్కువ మంది ఉన్నారు. ముస్లిములు తక్కువమంది ఉన్నారు. ముస్లిములను ప్రేమగా చూడాలని హిందువులను మందలించినంత మాత్రాన దేశానికి తండ్రిమైన గాంధీగార్ని హత్య చెయ్యటంలో అర్థమేముంది?

ఆరోజున గాంధీగారుపోయిన వార్తవిని నేను వెక్కి-వెక్కి ఏడవటం నీకు జ్ఞాపకం వుందిగదూ? "ఎందుకల్లా ఏడుస్తావన్నయ్యా?" అని నువ్వు అమాయకంగా అడిగావు. నువ్వప్పటికి బాగా చిన్నపిల్లవుగనక నేను చెప్పింది తెలియలేదు. గాంధీగారు మనకి దగ్గరచుట్టమనికాదు, మనకేదో ఉపకారం చేశాడనికాదు. ఆయన సర్వ మానవుల్ని ప్రేమించాడు. అందువల్లనే ఆయన్ని అందరూ ప్రేమించగలిగారు. ఆయన పోయినప్పుడు దగ్గిరచుట్టమో, స్నేహితుడో పోయినంతగా అంతా ఏడ్చారు. కాని గాంధీగారు జయించాలన్న ఇంకో దుర్గుణం ఏమిటో తెలుసా? అధైర్యం. ఎన్ని కష్టాలువచ్చినా ధైర్యం పోగొట్టుకోవద్దన్నాడు పిరికిపందలే ఏడుస్తారన్నాడు. ఆయన దేశానికి నాయకుడయిన తరవాత, ఆయన కనుకొలకులకొనల్లో కన్నీరు నుంచుని తొంగిచూడగా ఎవ్వరూ చూడలేదు. ఒకసారి ఆయన్ని ఒక పఠాన్ చాచిలెంపకాయ కొట్టాడు. అప్పుడు కన్నీటిబిందువు అడిగింది: "బయటికి రానా?" అని. గాంధీగారు ఆలోచించి "అక్కర్లేదు" అన్నారు. ఇంకోసారి దక్షిణాఫ్రికాలో ఉండగా తెల్లవాళ్లు ఆయన్నికింద పడేసి కొట్టారు. అప్పుడొకసారి కన్నీటిబిందువు బయటికి రావాలని చూసింది. ఆయన "వెనక్కి-పో" అని గద్దించేసరికి అది గజగజలాడి ఆయన గుండెలోపలే రాలిపోయింది. ఇలాగే ఎన్నోసార్లు కన్నీటిబిందువు ఆయన్ని జయించాలనిచూసింది. అన్నిసార్లూ ఆయనే కన్నీళ్లను జయించాడు.

గాంధీగార్ని చూసి నువ్వుగాని, నేనుగాని నేర్చుకోవలసింది యిదే. ఎన్నికష్టాలైనా రానీ, కళ్ళల్లో కన్నీళ్లకి చోటివ్వగూడదు. కష్టాలు తొలగించుకునేందుకు ప్రయత్నించాలి. కష్టాలతో దెబ్బలాడి, బ్రిటిష్‌వాళ్లని దేశంనుండి వెళ్ళగొట్టినట్టు, వాటిని మన జీవితంనుండి వెళ్లగొట్టాలి. అప్పుడూ సౌఖ్యం.

అయితే బ్రిటిష్‌వాళ్లని వెళ్లగొట్టినా మనకి కష్టాలుతప్పలేదేమంటావేమో? దానికి ఎప్పుడైనా ఇంకోసారి సమాధానం చెబుతాలే. గాంధీగార్ని గూర్చి ఇంత పెద్ద ఉత్తరం రాశాను. ఈవారం యిది చదువుకో, వచ్చేవారం ఇంకొక గొప్పవాణ్ణి గురించి రాస్తాను,

నీ అన్నయ్య,
—ఎన్నార్.

(24-వ పేజీ తరువాయి)

## కోకిలపక్షి

పంచమస్వరంలో కూస్తుంది. మొదట్లో తగ్గుస్థాయిలో కూత ప్రారంభించి క్రమంగా పైస్థాయిదాకాపోయి హఠాత్తుగా పాట ఆపేస్తుంది. కాస్సేపాగి మళ్ళీ తగ్గుస్థాయిలో ప్రారంభిస్తుంది. కోకిల సంగీతానికి మన దేశపు కవిత్వంలో మొదటినుంచీ ఎంతో ప్రాముఖ్యం ఇవ్వబడింది.

ఏప్రిల్, ఆగస్టు నెలలమధ్య గుడ్లు పెడుతుంది. కోకిలలకి గూడుకట్టుకోవడం బద్ధకం. అందుకని మగకోకిల ఏంచేస్తుందంటే కాకి గూడుమీద దాడి చేస్తుంది. మగ ఆడ కాకులు రెంటినీ ఏదో నెపం మీద కయ్యానికి కవ్వించి గూటికి దూరంగా తరుముకుపోతుంది. ఈలోగా ఆడ కోకిల కాకిగూట్లో గుడ్లుపెట్టి కాకిగుడ్లతో కలిపేస్తుంది. కాకులు తిరిగి వచ్చి చూసుకుంటే ఏది తమదో, ఏదికాదో తెలియక అన్ని గుడ్లనీ పొదుగుతాయి. గుడ్లు పిల్లలయ్యాక కోకిల పిల్లలు ఈ గూడు మాదంటే, కాకి పిల్లలు ఈ గూడు మాదని దెబ్బలాడుకుంటాయి. ఏవిజయిస్తే అవి గూటికి సర్వాధికారులవుతాయి. ★

# విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం

(22-వ పేజీ తరువాయి)

చిత్రాలు ప్రచురింపబడ్డాయి. ప్రతిపత్రికలోనూ ప్రచురణాలయం తాలూకు ప్రకటనలు కనబడుతూవచ్చాయి. సంపాదకులకు కార్యాలయంలో తేనీటి విందులు, తరువాత పత్రికల్లో పుస్తకాలనుగూర్చి శుభసమీక్షలుకూడ ప్రత్యక్షమైనాయి. రోజూ పోస్టుబంట్రోతు రెండు మూడు వందల రూపాయల వి పి.లు మనిఆర్డర్లు రెండు మూడు నెలలపాటు సంపాదకులకు అందచేస్తూ వచ్చాడు. సాయంకాలం 4 గంటల నుంచి కార్యాలయానికి వేంచేసే కలందారుల సంఖ్యకూడా హెచ్చయింది లోపలికొచ్చేటప్పుడు దిగాలుపడిన ముఖంతో వచ్చిన సాహితీపరులనేకమంది మిసెస్ రమచేతి కాఫీత్రాగి, వక్కపొడి నముల్తూ, సిగరెట్టు దమ్ముతీస్తూ సంతృప్తితో బయటికి పోతూఉండేవారు ఋణమో ఫణమో ఆశించివచ్చిన గ్రంథకర్తలు కప్పు కాఫీతోటీ రావ్ గారి ఆశాజనకమైన సాంత్వనవాక్యాలతోటీ, రమ తియ్యటి చూపులతోటీ సంతృప్తిచెందిపోతూ ఉండేవారు

*　　*　　*

కొద్దికాలంలో విశ్వవిజ్ఞాన ప్రచురణాలయంవారు రామాయణ భారత భాగవతాలను ఇంగ్లీషు, జర్మన్, రష్యన్, ఫ్రెంచి భాషల్లోకి తర్జుమాచేయించి, చక్కగా అచ్చొత్తించి, ప్రచురణ చేయదలచుకున్నారనీ, ఇందునిమిత్తం ఒక ఉదారుడు కొన్ని వేల రూపాయలు ప్రచురణాలయంవారి స్వాధీనం చేశారని, ఇంకా విశ్వ సాహిత్యోపాసకులు ఘనంగా విరాళాలిచ్చి తోడ్పడాలనీ పత్రికల్లో ప్రకటన పడింది ఈ కార్యంనిమిత్తం వెయ్యి రూపాయలిచ్చిన మహారాజపోషకుల సంగ్రహ చరిత్రను ఆయా పాశ్చాత్యభాషల్లో ఫోటోలతోసహా ప్రచురింపబడతాయని సంయుక్త సంపాదకులు స్వంతంగా ప్రకటించారు ఇంకా రాజపోషకులు, అభిమానులు, అనేక తరగతులుకూడా ఏర్పాటు చేయబడి వాటి హుందాకు సరిపడ్డట్టుగా కట్నాలుకూడా నిర్ణయింపబడ్డాయి. పోస్టుజవాన్ ఇతోధికంగా మని ఆర్డర్లు కార్యాలయానికి అందచేశాడు మహారాజులు రాజులు ప్రభుత్వాలు చేయలేని ఘనకార్యాన్ని ఈ పుణ్యదంపతులు కొనసాగిస్తున్నారనీ, భారతీయ సంస్కృతికి అపారమైన సేవ చేస్తున్నారనీ లోకమంతా చెప్పుకోవడం ప్రారంభించారు. ప్రకటనతోపాటు పత్రికల్లోకూడా ప్రశంసావచనాలు వ్రాయబడ్డాయి అచ్చాఫీసులవారు ఒకరు కానకుండా మరొకరు ఈ మహాత్కార్యానికి తోడ్పడడానికి పూనుకున్నారు. కొందరు అచ్చుఖర్చుమట్టుకే అచ్చుకుంటే, మరికొందరు కాగితంపెట్టుబడికూడా అంగీకరించారు. విజయదశమినాటికి రామాయణం మొదటి సంపుటాన్ని ప్రచురపరచే మహోత్సవాన్ని స్వయంగా విద్యామంత్రిగారే జరిపిస్తారని రాష్ట్రంలోని సాహితీపరుల కందరికీ గిల్టు అక్షరాలతో అచ్చొత్తింపబడిన పెద్దపెద్ద ఆహ్వానపత్రాలు పంపబడ్డాయి - దానితో మహారాజపోషకులు రాజపోషకులు స్వయంగా ముడుపులు చెల్లించుకుని స్వీయచరిత్రసంగ్రహాలను కొత్త ఫోటోగ్రాఫులను సంపాదకులకు సమర్పించుకున్నారు.

*　　*　　*

ఒకరోజు తెల్లవారేసరికి మామూలుగా కళకళలాడుతూఉండే విశ్వవిజ్ఞాన ప్రచురణాలయానికి తాళం వేయబడింది. ఒక్క సాహితీపరుడు యథాలాపంగా వెళ్లి చూచేసరికి ఆ స్థితిలోఉంది ప్రచురణాలయం బోర్డు, రావ్ రమగారి బోర్డులు అంతర్ధానమైనాయి. ఊరంతా గుప్పుమంది ఒకళ్లిద్దరై గంటా గంటన్నరయ్యేసరికి వందలకొద్దీ జనం కార్యాలయం చుట్టుముట్టేరు ఊళ్లోని సాహితీపరులు. కుంచె వాడించేవాళ్ళు, అచ్చాఫీసు ప్రొప్రయిటర్లు, స్టేషనరీ దుకాణదార్లు, ఆఫీసు సిబ్బంది చిల్లర దుకాణదార్లు, పాలవాళ్లు, నేతివాళ్లు ఒక్కరన్నమాటేమిటి ఊళ్ళో అశేషజనం మూగేరు. రమగారి చేత్తో కప్పు కాఫీ త్రాగినవాళ్లు, రావ్ చేత్తో ఇచ్చిన ఒక్క సిగరెట్టు

త్రాగినవాళ్లు అంతా గుమిగూడి గుంజాటన పడ్డారు. ఇటీవల యుద్ధానంతర వ్యవహారాల్లో స్వల్పకాలంలో లెఖ్ఖకతీతమైన డబ్బును సంపాదించి పరువు మర్యాదల కోసం రాజపోషకులుగా ఫోటోల్లో పడడానికి ఉవ్విళ్ళూరుచున్న ప్రముఖులు దూరదూరంగా నిలబడి తమ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుకున్నారు చివరకు వేలుదాకా పెట్టుబడులు పెట్టిన అచ్చాఫీసులవారు, పుస్తకాలు ప్రచురణకిచ్చి కాని ముట్టని సాహితీపరులు, సాహసించి తలుపులు బ్రద్దలు కొట్టి ప్రవేశించారు నాలుగు కుర్చీలు, రెండు బల్లలు, రెండురీముకాగితాలు, 8 బీరువాలు పుస్తకాలు పాత న్యూస్ పేపర్లు, సర్క్యులరు ఉత్తరాలు, హుక్కా గొట్టం, కప్పు సాసర్లు, ఖాళీ సిగరెట్టు డబ్బాలు వగైరా చిల్లరిసామగ్రి చిందరవందరగా పడుంది ఒక్కసారి జనమంతా గుప్ మన్నారు. ముక్కుమీద వ్రేలేసుకున్నారు కొందరు లోపలి దుఃఖాన్ని తిట్లుగా మార్చేశారు మరికొందరు. నాకు వందపై చిల్లర బాకీ అంటే, నాకు వెయ్యిపై చిల్లర బాకీ అని వాపోవడం ప్రారంభించారు జనం. నిజంగా ఎక్కువ నష్టపడ్డ బుద్ధిమంతులు గ్రుడ్లల్లో నీరు మ్రింగుకుని తమ అమాయకత్వాన్ని నీలైనంత కప్పిపుచ్చే ప్రయత్నంలో పడ్డారు. ఆఖరు కొక బుద్ధిమంతుడు సాహసించి రావ్ గారి డ్రాయరు తీసేసరికి చక్కగా ముద్దులు మూటగట్టే అక్షరాల్తో వ్రాయబడ్డ ఈ క్రింది కాగితం దొరికింది.

> "ఇష్టంగానూ, అయిష్టంగానూ, తెలిసీ తెలియకా, కామ్యతతోనూ, నిష్కామ్యతతోనూ, మా విశ్వవిజ్ఞాన ప్రచురణాలయానికి సహాయపడిన కలంవీరులకీ, కళాకారులకీ, అచ్చాఫీసుల వారికీ తదితరులకీ మా కృతజ్ఞత రాజపోషకులకీ మహారాజ పోషకులకీ వందనాలు.
>
> రావ్-రమ
> సంయుక్త సంపాదకులు
> విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం
>
> వ.రా:— మాకున్న అప్పులకు ఈ ఆవరణలోనున్న ఆస్తిని సరిపెట్టకోండి. మరో దేశంలో మరో అవతారంలో ఉదరపోషణచేసుకోనివ్వండి"

కడుపుమండిన సాహితీపరు డొకడు మరుచటివారం 'ఉదరసేవ' పత్రికలో విశ్వవిజ్ఞాన ప్రచురణాలయానికీ తనకూ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలను పూర్తిగా ప్రకటించాడు - తన కడుపులోని ఆక్రోశమే కాకుండా, రావు రమగార్లు తన్నుగూర్చి వ్రాసిన ప్రశంసా వాక్యాలను లోకంలో పారయ్యాలనే స్వల్పమైన స్వార్థంకూడా చూచుకుని ఈ ప్రచురణ చేశారు - సామాన్యంగా ఏదో ప్రయోజనంలేకుండా ఏమీ ప్రకటించని 'ఉదరసేవ' ఈ ఉత్తరాలను ప్రచురించటంలోగల రహస్యంమాత్రం ఇంకా బయటికిరాలేదు. ప్రకటన బాపతు డబ్బుముట్టని కోపం అని కొందరు అనుకుంటున్నారు. ఆ ఉత్తరాలను తిరిగి ప్రచురించినందుకు 'ఉదరసేవ' పత్రికాధిపతులు మన్నించెదరుగాక!

(1)

విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం
కవితా కుటీరం
శ్రీపురం
. .... ...

సంపాదకులు
యం యస్ టి. రావ్ (యం పి హెచ్)
(కార్నైలు)
య. యస్. రమ (బి. ఏ యు జి ఏ)

కవితా విశారదులు, పూజ్యులు, శ్రీ శ్రీ విశ్వనాథ శాస్త్రిగారికి—

మహాశయా,

నమస్కారములు తమరు లోగడ ప్రచురించిన ఖండకావ్యాల సంపుటినిగూర్చి పత్రికల్లో ప్రచురించబడ్డ వ్యాఖ్యానాలను చూచి మిక్కిలి ఆనందించినాము ఆ పోకడలు చూచి ఆంధ్రలో తాము రవీంద్రులంతవారని మా సంయుక్త సంపాదకురాలి అభిప్రాయం తాము వ్రాసిన గ్రంథాలేమైనా ఉంటే తెలుగున ప్రచురించడమే కాకుండా ఆంగ్లభాషలోకి అనువాదంచేసి ప్రకటించే ఏర్పాట్లు చేస్తాం. మీ అంగీకారంకోసం వేచియున్నాం.

ఇట్లు
భవదీయులు
రావ్-రమ

వ.రా: ఈలాంటి గ్రంథాలు కొన్ని ఆంగ్లంలో ప్రచురణైతే తప్ప తెలుగువాళ్ళకు నోబుల్ బహుమానాలు లభించవు.

(2)

నవ్యసాహిత్యవిలాసం
సర్వజ్ఞపురం
.... .. ...

శ్రీ విశ్వనాథశాస్త్రి
సారస్వతోపాసకుడు
విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం
సంపాదకులకు

మహాశయులారా,

తాము అత్యంత ఆప్యాయతతో వ్రాసిన ఉత్తరం అందినది. తాము వ్రాసిన ప్రశంసావాక్యాలకు సంతోషమైనా అంతటి ప్రశంసకు నేనర్హుడను కాను. నాబోటివారి సాహితీకృషి తమవంటి ప్రతిభావంతుల ప్రశంసకు గురియైనందుకు నాకు చాలా ఆనందమైంది. తప్పకుండా నా రచనలన్నీ మీకు ఇందుతో పంపుతున్నాను ఉత్తమమైనవి ఏరి ప్రచురించండి మీబోటి ఉదారులకు సహృదయులకు ప్రతిఫలం విషయం నేను చెప్పక్కరనే లేదు.

భవదీయుడు
విశ్వనాథశాస్త్రి

(3)

విశ్వవిజ్ఞాన ప్రచురణాలయం
కవితా కుటీరం
శ్రీపురం
.. . .. ...

సంపాదకులు
యం యస్ టి రావ్ (యం పి. హెచ్) కర్నలు
యం యస్. రమ బి. ఎ (యు జి ఎ)

మహాశయా,

తాము వ్రాసిన ఉత్తరం, తమ రచనలు అందినవి త్వరలో ప్రచురించగలం రచయితలకు ప్రతిఫలంవిషయమై తాము ప్రస్తావించినారు రచయితలకు తగిన ప్రతిఫలం ముట్టడం లేదనే మా ప్రచురణాలయాన్ని స్థాపించినాము. అసలు ఖర్చులు పోను నికరాదాయంలో నూటికి 75 పాళ్లు రచయితలకు ఇవ్వడమే మా లక్ష్యం

చిత్తగింపుడు
రావ్-రమ



# పరిష్కారం

(21-వ పేజీ తరువాయి)

వస్తాయని నౌకజ్జితెచ్చి, అమ్మాయి నియ్యడం యేమిటి?

డైర: నువ్వు వాళ్ళనుచూస్తే, అట్లా అనవు. ముఖవర్చస్సుబట్టి చూస్తే యిద్దరూ మంచికుటుంబానికి చెందినవారే ననిపిస్తుంది. కష్టపడి చదువుకున్నవాళ్లు. పోతే ప్రస్తుతం వాళ్లు దరిద్రావస్థలో ఉండి ఉండవచ్చు. దరిద్రం, భాగ్యం యివి యీ సమాజంలో దురదృష్టం, అదృష్టం అని పిలుస్తాపే, వాటిమీద ఆధారపడి ఉంటై. వ్యక్తి అభివృద్ధికి సమానావకాశాలు లేని నేటి సామాజికవ్యవస్థలో, యెలాగో ఒకలాగు అవకాశం దొరికి, అభివృద్ధి పొందినవాడు అదృష్టవంతుడు, లేనివాడు దురదృష్టవంతుడు. అంతే భేదం. నేనుమాత్రం చిన్నతనంలో నానా అగచాట్లు పడి చదువుకోలా? కాబట్టి, దీనివల్ల మనం దిక్కులేనివాళ్ళకు దిక్కు చూపించినవాళ్లమవుతాం. అమ్మాయికి వచ్చిన అపవాదు యీ తంతుతో సమసిపోతుంది. యేమంటావ్?

వని: అయితే పిల్లవాణ్ని చూడాలి ముందు. యేరీ వాళ్ళసలు.

డైర: లోపలనే ఉన్నారు పోదాం పద!

★



# కరోడా

(15-వ పేజీ తరువాయి)

అతుకుతుంది. లేకుంటే 'కరోడా' అన్నమాటే. ఇలాంటివన్నీ చూసుకోవాలబ్బాయి" అంటూ తాపీగా చూచాడు.

ప్రస్తుతం నీ మారనిరూపాయిని గురించి నా ఆలోచనేమిటంటే దీనిని నీకోటివాళ్లకే అంటే–నీకిదిచ్చినప్పుడు, పరీక్షించకుండా తీసుకున్నావా లేదా?—అలాంటివాళ్లకే అంటే పరీక్షించడం పురానాకు లోటనుకునే హుందావారికే రూపాయిల మధ్య పెట్టి ఇచ్చెయ్యి. వారు మొత్తం లెక్కపెడతారేకాని మంచీచెడ్డా చూడరు. అంతగా చూస్తే నీది పొరబాటని ఒప్పుకోవచ్చు. నామోషీ ఉండదు. సర్వసాధారణంగా ఇది విజయవంతంగా సాగిపోతుంది. నీకు దీనిపీడ వదుల్తుంది.

మేము తర్వాత భోజనానికి లేచాము. భోజనం చేస్తున్నంతసేపూ ఇదే ఆలోచన. సుబ్బారాయుడుతాత వెళ్లిపోయినా నా దృష్టి ఈ కరోడామీదే ఉంది. మనస్సుమాత్రం దీనిని భరింపబోయే పెద్దమనిషి ఎవడా అని తడుములాడుతోంది. ఆ మర్నాడో మూడోనాడో (సరిగా జ్ఞాపకం లేదు) మా శంకరంబావ వచ్చాడు. సుబ్బారాయుడితాత చెప్పిన లక్షణాలు వాడిలో మూర్తీభవించాయి.

కాలికి బూటు, చేతికి రిస్టువాచి, టర్కింగు కోటుకాలరు మొత్తం ఇంతెందుకు ఫుల్ సూటుమీదున్నాడు. వాడిని చూసీ మాడ్డంతోటే, పిల్లపెళ్ళికి శొంఠ పెట్టుకొన్నవాడికి పెళ్లికొడుకు దొరికినట్లయింది. ఆదరసత్కారాలు మామూలుగా జరిగాక ఇష్టాగోష్ఠిలోపడ్డాము. ఇంతలో ఇంట్లోంచి వంటైనట్టు కేకవచ్చింది. "లేవోయ్ స్నానానికి, లే" అన్నాను. "నేను స్నానంచేసివచ్చాను; నువ్వు చెయ్యి" అన్నాడు. నేను లేచి బట్టమార్చబోయాను. నా 'కరోడా' రూపాయి బొడ్డులోనే ఉంది. చటున స్ఫురించింది. "ఏమోయ్ బావా! ఇప్పుడు మళ్లీ పెట్టెదగ్గరికి వెళ్ళలేను. ఈ రూపాయి నీదగ్గరుంచు. తర్వాత తీసుకుంటాను" అని అతని చేతికిచ్చాను. అతడు దాన్ని తీసుకొని పరిశీలన చెయ్యనేలేదు. టక్కున తన పర్సులో వదేసుకున్నాడు. రూపాయిలమధ్యపడ్డ చప్పుడయింది. సక్రమంగా స్నానభోజనాదులయ్యాయి. వెళ్ళిపోతూ, వెళ్ళిపోతూ శంకరం "అన్నట్టు నీ రూపాయి నీకివ్వలేదంటూ అడావిడిగా పర్సులోనుంచి ఒక రూపాయితీసి ఇచ్చాడు. అందుకుంటూనే పరీక్షగా చూశాను. సంతోషంతో జేబులోవేశాను. వీడ్కోలు గొడవలో అది బయటపడలేదు. మా బావ వెళ్ళిపోయాడు. నేను "ధన్యోస్మి" అని తల తడుముకున్నాను.

★



మానవతిలో ముక్కామల

# దర్శకత్వము

[ శ్రీ ఎల్ వి ప్రసాద్ ]

చలన చిత్ర నిర్మాణము వివిధ కళాకారుల, నిపుణుల సహాయ సహకారములపై ఆధారపడి వుంటుంది. ఇది వ్యాపార సంబంధమైన కళ. ఛాయా చిత్రగ్రాహకుని సర్వతోముఖ కేంద్రీకృత కిరణ పుంజాలూ, శబ్దగ్రహణ యంత్ర చోదకుని ధ్వని సమ్మేళనా కేంద్రం కళా దర్శకుని చిత్ర వర్ణములతో కూడిన అలంకరణాల... మొదలైన వెన్నో చిత్రము రసవంతముగానూ, మనోజ్ఞంగానూ, వాస్తవికంగానూ చిత్రింపబడటానికి తోడ్పడతాయి.—ఎవరో ఒక కథకుని కథావస్తువు చిత్రానికి 'నాంది' అవుతుంది. ఇక వివిధ రంగములలోని కళాకారులసహకారముతో చిత్రము యొక్క రూపు రేఖలు తీర్చి దిద్దబడతాయి

దర్శకత్వం అంటే ఏమిటి?—

కథా కథనం, వెండి తెరపై కండ్లకు కట్టినట్లు ప్రేక్షకులకు కథను చూపించడం. చిన్నతనంలో మనమందరం మన అమ్మమ్మలు చెప్పే కథలు ఎంతో శ్రద్ధగా విన్నాం. ఈ కథలనే నేడు ప్రత్యక్షంగా చలన చిత్ర రూపంలో చూస్తూన్నాం. ఈ విధంగా చూచేటప్పుడు కథ వినటమే కాకుండా, కథా సన్నివేశాలని కండ్లకి కట్టినట్లు చూస్తూన్నాం. ఈ సమయంలో కేవలం చిత్రాన్ని చూడడమే కాక కథలోని పాత్రల సుఖదుఃఖాలనీ, ఆవేశాలనీ అప్రయత్నంగా మనం కూడా పంచుకుంటూన్నాం ఈ విధమైన రసానుభూతి ప్రేక్షకునిలో ఏ విధంగా కలుగుతుంది? కథ జరుగుతూన్న కొలదీ, ప్రేక్షకునిలో "ఇటు పైని ఏమి జరుగుతుంది? ఏమి జరుగుతుంది?" అనే ఆతురతతో ముందు జరగబోయే దానికి ఎదురు చూస్తూ తాను కూర్చున్న చోటనే వుండి పోతాడు? తనని తాను మరచి చిత్రములోని పాత్రలతో ఏకత్వం ఏ విధంగా పొందుతాడు? ఈ ప్రశ్నలకి సమాధానం ఒక్క మాటతో చెప్పాలంటే "చిత్ర నిర్వహణ" పైననే ఇవన్నీ ఆధారపడి వుంటాయి.—ఇదే చిత్ర నిర్మాణంలో దర్శకుని విధి.

ఒకే కథని అనేక విధములుగా నిర్వహింపవచ్చు. ఈ నిర్వహణలో ఒక్కొక్క-



రోహిణీవారు తియ్యబోతున్న 'శాంసన్ ఎండ్ డెలీలా'లో శాంసన్-సుదర్శన్.



ముచ్చటగా మూడో భార్యతో పీటలమీద కూర్చుని షష్టిపూర్తి చేసుకుంటున్న మాంధాత.
—వినోదావారి "శాంతి"లో డా. గోవిందరాజుల, సావిత్రి.

దర్శకుడు ఒక్కొక్క పంథా అనుసరిస్తాడు. వివిధ పాత్రల నిర్వహణాలో కూడా ఎన్నో రీతులున్నాయి. ఉదాహరణకి ఒక గ్రుడ్డివానిని చూపించవలసి వచ్చినపుడు అతని కండ్లు లేనట్టుగా "క్లోజప్"లో చూపించవచ్చును. ఇంతకంటే అతని చేయికాని, చేతులుకాని దేనికోసమో తడుముకుంటూన్నట్టు చూపించి, తరువాత దూరంనుంచి ఆ మనిషిని చూపిస్తే ఎఫెక్ట్ బాగా వుంటుందని నా అభిప్రాయం—ఈ విధంగానే ధనికురాలైన ఒక స్త్రీని చూపించవలసి వచ్చినపుడు ఆమె ధరించిన చీర జరీ అంచు క్లోజప్‌లో చూపించితే ప్రేక్షకులు ఆమె ఒక ధనికురాలని సులువుగా తెలిసికొంటారు. కథా నిర్వహణాలో కేవలం వ్యక్తులే కాక, వివిధ వస్తువులను ఆయా సమయాలలో తగినవిధంగా అమర్చటం వలన అనేక విషయాలను నిరూపించవచ్చు. ఒక హత్యని చూపించవలసినపుడు ప్రత్యక్షంగా కత్తిని గుండెలలో దింపుతూన్నట్టు చూపించనక్కరలేదు. హంతకుడు చేతిలో కత్తితో ప్రవేసిస్తూన్నట్టు చూపించి, తరువాత ఏవేవో కొన్ని ధ్వనులు, పెద్ద మూలుగూ, హంతకుడు పారిపోతూన్న అడుగుల చప్పుడూ,...ఆఖరున ఆ గదిలో చిందరవందరగా పడివున్న సామానూ, ఆమధ్య చచ్చిపడి వున్న శరీరం చూపిస్తే హత్య 'ఎఫెక్ట్' ఎంతో బాగుంటుంది.

దర్శకత్వంలో 'స్క్రిప్ట్'ను వివిధ 'షాట్స్' క్రింద విభజించడం ఒక ముఖ్యమైన విషయం. ఈ విభజనలో ఆవిధంగానే ఎందుకు విభజించాలి? మరో విధంగా ఎందుకు చేయకూడదు అనేదానికి నిర్దుష్టమైన సమాధానం చెప్పడం కష్టమే!

ప్రేక్షకుల హృదయంలో ఒక విషయం బాగా నాటుకొనడానికి కాని, లేక ఒక ప్రత్యేక భాగాన్ని ప్రేక్షకులకి బాగా చూపించడానికిగాని "క్లోజప్స్" ఉపయోగిస్తారు. ఇదేవిధంగా ఒక విశాల భవనాని

కాని, విశాల ప్రదేశాన్ని గాని చూపించవలసి వచ్చినపుడు "లాంగ్ షాట్స్" ఉపయోగిస్తారు—ఈ విధంగా వివిధ 'ఎఫెక్ట్స్' కలిగించడానికి ఏ సమయంలో ఏ 'షాట్' ఉపయోగింప వలసినదీ దర్శకుడు నిర్ణయిస్తాడు.

చలనచిత్ర దర్శకుడు చతుష్షష్టికళలలోనూ కొద్దో, గొప్పో పరిచయం గలిగి చిత్ర నిర్మాణంలో ఆరితేరిన వాడై యుండాలి. ఛాయాగ్రహణం, శబ్దం, సంభాషణలూ వీటిని గురించి బాగా తెలిసినవాడై యుండాలి. 'నటన' కు సంబంధించిన ప్రతి విషయమూ అతనికి కరతలామలకమై యుండాలి. దర్శకుడు నటీ నటులకు మార్గదర్శకుడూ, గురుతుల్యుడూ.

దర్శకత్వంలో ఇక్కడ రెండు విధానములని గురించి వ్రాస్తాను. నటీనటులకు వారు నటింపబోయే పాత్రను గురించి విపులంగా ప్రతి ఒక్కరికీ అర్థమయేటట్లు చెప్పి ఆయా సన్నివేశాలలో ఈ విధంగా నటిస్తే బాగుంటుంది అని సలహా ఇచ్చి ప్రేక్షకులలో సంపూర్ణమైన రసానుభూతి కలిగించాలంటే ఈ విధమైన ఉద్రేక పూరితమైన ఘట్టాలలో ఈ విధమైన అంగభంగిమల ద్వారా చక్కగా నటింపవచ్చును. అని చెప్పి తదనుగుణంగా నటిస్తూండగా దర్శకుడు తనకు ఉత్తమమైనదిగా తోచినది స్వీకరించడం *(take)* మొదటి పద్ధతి. ఇక రెండవ పద్ధతి దర్శకుడు స్వయముగా నటించి ఆ విధంగా నటించేటట్లు చేయడం. ఈ విధానములో నటీనటులు కేవలము దర్శకుడు చేసిన దానినే అనుకరింపవలసి వుంటుంది. ఈ రెండో విధానం ఒకవిధంగా ఆలోచిస్తే దర్శకునికీ, నటీనటులకీ కూడా సులువైన పద్ధతే.

దర్శకుడు తాను చెప్పదలచుకొన్న విషయాన్ని సూటిగా నటీనటులకి ఈ విధానం వలన చెప్పవచ్చు. కాని వచ్చిన చిక్కేమిటంటే నటీనటులు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి, కేవలం దర్శకుని చేతి కీలుబొమ్మలుగా తయారవుతారు ఈ విధానం వల్ల దర్శకుడు ఒక నియంతగా మారతాడు ఈ సందర్భంలో—కనుక పైన చెప్పిన మొదటి పద్ధతి వలన నటీనటులు తమలో నిద్రాణమై యున్న వివిధ శక్తులని ప్రతిభనీ చక్కగా తమ నటనలో చూపించే అవకాశం కలిగి తారాపథాన్ని అందుకో గలుగుతారు. అందుచేతనే నటీనటులచేత బలవంతంగా నటింప చేయడం మహాపరాధమని నా అభిప్రాయం.

దర్శకుడు మన స్తత్వ శాస్త్రంలో బాగా ఆరితేరినవాడై యుండాలి. ఒక ప్రత్యేక వాతావరణానికీ, పరిస్థితులకీ ఒక నటుని మనోభావాలు ఏ విధంగా వుంటాయి అన్న విషయం దర్శకుడు చక్కగా అవగాహన చేసుకొని తదనుగుణంగా ఆయా వ్యక్తులను చిత్రించాలి. కొన్ని విపరీత పరిస్థితులలో వారి వారి మనోభావాలు ఏవిధంగా మార్పు చెందుతాయో, ఆయా స్వభావాలని దర్శకుడు వ్యక్తీకరింప గలగాలి. ఇంతే కాక, తాను నిర్మించిన చిత్రాన్ని చూడబోయే వివిధ తరగతుల ప్రేక్షకుల అభిరుచులనీ,



"పోటీ ఎవడొస్తాడో చూస్తాగా!"
భీమన్న అట్టేమేధావి కాదు. కాని చిట్టిని తననుంచి ఎవరూ వేరుచెయ్యలేరనిమాత్రం అతని గాఢవిశ్వాసం.
విజయా వారి "పెళ్లి చేసిచూడు"లో పుష్పలత, వెంకయ్య.



ఒంటరి మగాడికి ఆడదిక్కు
విజయావారి "పెళ్లిచేసిచూడు"లో ఎన్ టి రామారావు, జి వరలక్ష్మి

మనోభావాలనీ దృష్టిలో వుంచుకొని చిత్రనిర్మాణం సాగించాలి. ప్రేక్షకులు తన చిత్రాన్ని చూచి ఏవిధంగా '*Feel*' అవుతారు అనే విషయాన్నీ కూడా దర్శకుడు ఊహించాలి.—'ఓరిమి' అన్నది దర్శకుని విజయానికి ప్రథమ సోపానం. ఒక్కొక్క సమయంలో తాననుకున్న విధంగా నటీనటులు పాత్రనిర్వహణం చేయలేకపోవచ్చు. అట్టి సమయాలలో దర్శకుడు, ఓరిమి, పట్టుదల కోల్పోకుండా, నటీనటులని ప్రోత్సహిస్తూ, ఒకే ఘట్టాన్ని ఎన్నిసార్లు తీయవలసివచ్చినా సహనాన్ని కోల్పోకూడదు. దర్శకుడు ఈ అంతరాయానికి నటీనటులమీదా, తదితరులమీదా కోపగిస్తే ఎన్నటికీ ఉత్తమచిత్రాన్ని నిర్మించలేడు. దీనివలన నటీనటులు తాము నటించే పాత్రను మనస్ఫూర్తిగా నటించలేరు సరికదా అనాటి తంగాలంకరణ వ్యర్థమౌతుంది. దీనివలన ఆర్థికంగా చిత్రానికి కలిగే నష్టం సులువుగా ఊహించుకోవచ్చు.

చలనచిత్రనిర్మాణంలో వివిధ వ్యక్తుల పరస్పర సహకారంతో చిత్రనిర్మాణాన్ని సాగించే ముఖ్యవ్యక్తి దర్శకుడు. వివిధ శక్తులను సమీకరించి, చిత్రానికి పరిపూర్ణత నుకూర్చేవాడు దర్శకుడు. ఒక్క మాటలో చెప్పాలంటే చలనచిత్రస్యందనానికి దర్శకుడు 'సారథి' వంటివాడు.

[శ్రీ ప్రసాద్ గారి అనుమతితో సినీ–టెక్నీషియన్స్ ఎసోసియేషన్ జర్నల్ నుండి పునరుద్ధరితం. అనువాదం–శ్రీ స్వర్ణకాంత్.]



## సినిమావార్తలు

### "శాంసన్ ఎండ్ డెలీలా"

ఆంధ్ర ఫిలిం పరిశ్రమకు సుపరిచితులైన శ్రీ హెచ్. ఎం. రెడ్డిగారు, "రోహిణీ స్టూడియోస్" పేరుతో నిర్మించిన సొంత స్టూడియో పూర్తి కావడంతో, ఒక బ్రహ్మాండమైన ప్రణాళికను తయారుచేస్తున్నట్లు తెలుస్తున్నది. ఇందు ప్రధానమైనది ఇటీవలనే భారత దేశాన్ని అంతా ఉర్రూతలూగించిన "శాంసన్ ఎండ్ డెలీలా"



పద్మనాభా వారి 'రాజేశ్వరి'లో శ్రీరామమూర్తి

కథను తెలుగు, తమిళ్, హిందీభాషల్లో నిర్మించడం. ఇందు "శాంసన్" పాత్రకు శ్రీ సుదర్శన్ అను యువకుని శ్రీ రెడ్డిగారు "బుక్" చేశారు. ఈయన మైసూరు రాజ్యానికి ఎప్పుడో వలసవెళ్లిన తెలుగువాడు. ఈయన వంశంవారు పారంపర్యంగా మైసూరు ఆస్థాన మల్ల యోధులుగా వుంటున్నారు. వయస్సు 28 సం॥ 1949 లో లాహోరులో జరిగిన అఖిలభారత కుస్తీల పోటీలో ప్రథముడుగా జయంపొందినవాడు.

చిత్రనిర్మాణానికి అవసరమైన ఇతర ఏర్పాట్లను కూడా శ్రీ రెడ్డిగారు చాలాచురుకుగా చేస్తున్నారు. మార్చిలో సెట్టుమీదకు ఎక్కదలచారు. ఈచిత్రాన్ని నిర్మించడంలో తటస్థపడే ప్రత్యేక కష్టనిష్ఠురాలను బాగా గుర్తించి కూడా ఇటువంటి మహత్తర చిత్రాన్ని సాధించాలనే పట్టుదలతో కార్యరంగంలోనికి దిగామంటున్నారు శ్రీ రెడ్డిగారు.

ఇదికాక "వెంజన్స్" అనే అడ్వెంచర్ చిత్రము, "సిద్ధహస్తమనే" జానపద చిత్రము తెలుగు, తమిళ భాషల్లో ప్రారంభించారు. షూటింగుజరుగుతున్నది. "రాజనాల," కాంతారావు అనే ఇద్దరు కొత్తనటులను వీనిలో ప్రధానపాత్రలకుగాను బుక్ చేశారు.

## హిందీలో 'నిర్దోషి'

ఈ చిత్రాన్ని హిందీ భాషలో 15వ ఫిబ్రవరినుంచి తీస్తున్నారు. తెలుగు చిత్రంలో నటీనటులతోనే ఈ చిత్రం కూడా తీయబడుతుంది. ఇందులో రామారావు, రంగారావు నటిస్తున్నారు. వీరిద్దరూ హిందీ చిత్రాలలో నటించడాని కిదే ప్రథమం.

## ఆదర్శం

శుభోదయవారి "ఆదర్శం" షూటింగు చురుకుగా సాగుతున్నది. శోభనాచల స్టూడియోలో జరిగిన షూటింగు ఫలితంగా సుమారు మూడవవంతు పూర్తి అయింది. మిగతా షూటింగు ఈనెలాఖరునుంచి రోహిణి స్టూడియోలో జరుగుతుంది.

## మేనరికం

"మేనరికం" అనే పేరుతో శ్రీజంపనా ప్రొడక్షన్సువారు ఒక సాంఘిక చిత్రం ప్రారంభించారు. షూటింగు శోభనాచలాలో జరుగుతున్నది. ఇందు హార్బరు వగైరా కొన్ని ఘట్టాలు "ఔట్ డోర్" షూటింగ్ జరిగినట్లున్నూ అవుట్స్ చాలా బాగున్నవనిన్నీ తెలుస్తున్నది.

## మరదలు పెళ్లి

ముక్కామలవారి మరదలు పెళ్లి చాలా చురుకుగా తయారౌతున్నది. ముక్కామలతోపాటు సూర్యకుమారి, కృష్ణకుమారి, జానకి, శ్రీరామమూర్తి ఇందులో ప్రముఖ పాత్రలు వహిస్తున్నారు.

## పీపుల్స్ఆర్ట్ ప్రొడక్షన్స్

పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్సువారు 'పల్లెటూరు"కు సంబంధించి ఆంధ్రదేశంలోని కొన్ని పల్లెదృశ్యాలను, వినోదాలను తీసే నిమిత్తం కృష్ణా గుంటూరు జిల్లాలకు వెళ్లారు. చిత్రాన్ని సాధ్యమైనంత సహజ వాతావరణంతో తయారుచెయ్యడానికి వీరు చాలా శ్రద్ధ తీసుకుంటున్నారు.





భారత లక్ష్మీవారి "ప్రియురాలు"లో కృష్ణకుమారి, వెంకటేశ్వరరావు.



శుభోదయవారి 'ఆదర్శం'లో చిత్రమైన ఒక సన్నివేశంలో
ఆత్రేయ, రేవతి, జానకి, జగ్గయ్య.

## కళ్యాణి, వలయుపతి

మోడర్న్ థియేటర్స్ (సేలం) వారి చిత్రాలు 'కళ్యాణి', వలయపతి తెలుగు, తమిళభాషలలో చురుగ్గా తయారవుతున్నాయి. 'కళ్యాణి' చిత్రంలో బి.యస్. సరోజ, సంబియార్ నాయికానాయకుల పాత్రలు ధరిస్తున్నారు. డైరక్టరు శ్రీ ఆచార్య. ప్రసిద్ధ తమిళ కవీశ్వరుడు వలయపతి జీవితచరిత్రకు సంబంధించిన రెండవ చిత్రానికి జనవరి 20 వ తేదీని ప్రారంభోత్సవం జరిగింది.

## 'పేదరైతు'

శ్రీ రాజరాజేశ్వరీవారి 'పేదరైతు'లో ఒక దృశ్యానికి మద్రాసులోని కాలేజి విద్యార్థులు వందమందిని జెమినీస్టూడియోస్‌కి తీసుకువచ్చారు. కథలో ఒక విద్యార్థి సంఘం ఏర్పాటుచేసుకొన్న నాటకంలో అంజలి నటిస్తుంది. ఈచిత్రాన్ని శ్రీ నాగభూషణంగారు డైరక్ట్ చేస్తున్నారు.

## సూర్యకుమారి

శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి హిందీ చిత్రాలలో ప్రవేశిస్తోంది. ఇటీవల ఆమె బొంబాయిలో కిశోర్ సాహూ తీయబోతున్న హిందీచిత్రంలో నటించడానికి కంట్రాక్టు కుదిరిందట.

## జెమినీవారి 'తల్లి'

జెమినీవారి 'తల్లి' శ్రీ నాగేంద్రరావు (భూలోకరంభలో నాయకుడు) దర్శకత్వం కింద తెలుగులోనూ తమిళంలోనూ తియ్యబడుతోంది. తెలుగుచిత్రం తెలుగు సంవత్సరాదినాటికి విడుదల చెయ్యాలని నిర్మాతలు యత్నిస్తున్నారు. ఈచిత్రంలో నాగేంద్రరావు, యం. కె. రాధ, శ్రీరామ్, కన్నాంబ, పుష్పవల్లి, వనజ మొదలైనవారు నటిస్తున్నారు.

## బారువా మెమోరియల్ సినిమా స్కూల్

స్వర్గీయ శ్రీ ప్రమథేశచంద్ర బారువా స్మారకచిహ్నంగా సినిమటోగ్రఫీ, సౌండ్ రికార్డింగ్, ఆక్టింగ్ మొదలైన అన్ని శాఖలలోనూ శిక్షణ నిచ్చే స్కూల్ ఒకటి కలకత్తాలో బౌబజారులో స్థాపించబడింది. ఈ స్కూల్ స్థాపనకు కృషి చేసినవారిలో ముఖ్యుడు శ్రీ యస్. ముఖర్జీ.



వర్ణ చిత్రాలను పోలినట్లుగా విలియం హారిస్ చిత్రించిన జడవస్తు దృశ్యం.

Regd No M [illegible]






వినోద పిక్చర్స్ - మద్రాసు 17.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras